# ప్రహ్లాద

అయినాపురపు సోమేశ్వరరాయకవిగారిచే

రచియింపఁబడినది.



పబ్లిషర్సు:

పసుపులేటి వెంకట్రామయ్యా

అండ్ బ్రదర్సు,

బుక్కుసెల్లర్సు, రాజమండ్రి.

రెండవకూర్పు 1000.

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

1925.



[ వెల రు 0-12-0.

# నాటకములు



| | | | |
|---|---|---|---|
| గయోపాఖ్యానం చి॥ ల॥ | 0- 8 | లంకాదహనం | [illegible]-10 |
| ప్రసన్న యాదవము | 0- 8 | రసపుత్రవిజయం అ॥ శే॥ | 0-10 |
| పారిజాతాపహరణం | 0- 8 | మోహినీరుక్మాంగద | 0-10 |
| చతురచంద్రహాస | 0- 8 | పాదుకాపట్టాభిషేకం దో॥ శీ॥ | 0-12 |
| సతీఅనసూయ అ॥ సో॥ | 0- 8 | పీష్వానారాయణరావు | 0-10 |
| విచిత్రచిత్రమాల | 0-12 | లోకాభిరామాయణం | 0- 6 |
| ప్రమదామనోహరం | 0-12 | విష్ణులీలలు అను దశావతారములు | 0-12 |
| వేశ్యామరందము | 0-10 | చంద్రకాంత చ॥ మా॥ | 0-10 |
| శారదావిజయం శా॥ స॥ | 0-12 | సంగీతస్త్రీసాహసం | [illegible]-12 |
| మహానంద | 0-12 | సంగీతసావిత్రి | 0-12 |
| భక్తకబీరు | 1- 0 | ఉషాపరిణయం దో॥ శీ॥ | 0- 8 |
| సంపూర్ణ రామాయణం | 1- 4 | సారంగధర | 0-12 |
| సంపూర్ణ భారతం సం॥ శీ॥ | 1- 4 | సంగీతశశిరేఖ | 0-12 |
| కృష్ణలీల | 1- 0 | సంగీతప్రహ్లాద చ॥ మా॥ | 0-12 |
| సంపూర్ణోత్తర రామాయణం | 1- 4 | బొబ్బిలియుద్ధం శ్రీ॥ కృ॥ | 1- 0 |
| పాండవవిజయం రా॥ నా॥ క॥ | 1- 0 | వేశ్యామధుర[illegible] దో॥ శీ॥ | [illegible] 8 |
| పాండవోద్యోగం | 0-12 | వేశ్యాహితబోధిని | [illegible] 0 |
| పాండవప్రవాసం | 0-12 | చాటుపద్యశ్రవణానందం | 0- [illegible] |
| పాండవజననం | 0-12 | విలువిద్య య॥ కృ॥ | 0- [illegible] |
| పాండవఅశ్వమేధం దో॥ శీ॥ | 0-12 | సత్యహరిశ్చంద్రీయం బ॥ ల॥ | 0- [illegible]4 |
| శ్రీరామవిజయం | 0- 8 | ఉత్తరరాఘవము | [illegible]4 |
| శ్రీరామవుద్యోగం | 0- 8 | భూలోకరంభ చ॥ మా॥ | 1- [illegible] |
| శ్రీరామప్రవాసం | 0- 8 | హరిశ్చంద్ర | 1- 0 |
| శ్రీరామజననం | 0- 8 | చింతామణి | 1- 0 |
| శ్రీరామఅశ్వమేధం | 0- 8 | గులాబకావలి | 1- 0 |
| ఆంధ్రపతాకం | 1- 0 | ఊర్వశీశాపవిమోచనం | 1- 0 |
| ద్రౌపదివస్త్రాపహరణం | 0-12 | గర్వభంగం | 0-10 |
| సతీతులసి రా॥ నా॥ క॥ | 1- 0 | శ్రీకృష్ణవిలాసం రా॥ సు॥ | 0-12 |
| అహల్యాశాపవిమోచనం | 0-12 | అభిజ్ఞానశాకుంతల వ॥ సు॥ | 1- 0 |
| కనకతార దో॥ శీ॥ | 0-12 | విక్రమోర్వశీయం | 0- 8 |
| శ్రీకృష్ణతులాభారం | 0-12 | భక్తచింతామణి | 0- [illegible] |
| శ్రీకృష్ణరాయభారం | 0-12 | వేణీసంహారం | 1- 0 |
| జయంతజయపాలీయం | 0-12 | కంఠాభరణం పా॥ ల॥ | 1- 0 |

వసుపులేటి వెంకట్రామయ్యా అండ్ బ్రదర్సు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

శ్రీ

# ప్రహ్లాద

౫ అంకముల నాటకము.

ఇది

అభినవసావిత్రి, నవరత్నచింతామణి, చంద్రగుప్తవిజయము

విచిత్రచిత్రమాలాద్యనేక నాటకములు

రచియించిన


## అయినాపురపు సోమేశ్వరరాయకవిచే


రచియింపఁబడినది.




ప్రకాశకులు:

**వసుపులేటి వెంకట్రామయ్య & బ్రదర్సు,**

బుక్కు-సెల్లర్సు, రాజమండ్రి.

రెండవ కూర్పు 1000

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.





1925

[వెల రు 0-12-0

# ఆశీస్సు



సీ. ఆకార సంపద । కనుకరించెడి విద్య
విద్యను మించిన । వినయవృత్తి
వినయంబునకు వన్నె । వెలయించు విభవంబు
విభవంబునకు మించు । వితరణంబు
వితరణాసక్తికి । విలసిల్లు ప్రియవాక్కు
ప్రియవచోనిరతికి । వెలయు గుణము
గుణగణవిస్ఫూర్తి । కనువైన సత్కీర్తి
సత్కీర్తికి మించు । సరసతయును
గీ. గలిగి శ్రీకాశ్యపసగోత్ర । కులజు డైన
యలఘు వైజర్సు రామరా । యాఖ్యు నెలమి
నాయురారోగ్య దివ్యభా । గ్యాది కళల
సతత మోముత శ్రీరామ । చంద్రమూర్తి.

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు

: పురుషులు :—

జయ, విజయులు—వైకుంఠ ద్వారపాలకులు.

సనక, సనందులు—ఋషీశ్వరులు.

విష్ణుమూర్తి.

హిరణ్యకశిపుఁడు—రాక్షసరాజు.

విప్రజిత్తి—మంత్రి.

శంబరుఁడు—హిరణ్యాక్షుని కుమారుఁడు.

అలంబాసురుఁడు—వేఁటవృత్తాంతముఁ జెప్పిన వాఁడు.

8. ఇంద్రుఁడు—స్వర్గాధిపతి.

9. నారదుఁడు—దేవఋషి.

10. బృహస్పతి—దేవగురువు.

11. యముఁడు—యామ్యాదిశాధీశుఁడు.

12. చిత్రరథుఁడు—వార్తావహుఁడు.

13. ప్రహ్లాదుఁడు—కథానాయకుఁడు.

14. చండామార్కులు—ప్రహ్లాదునకు విద్యగరపినవారు.

15. విరూపాక్షుఁడు—సేవకుఁడు.

16. దుర్ముఖుఁడు—హిరణ్యకశిపుని ద్వారపాలకుఁడు.

—: స్త్రీలు :—

1. లీలావతి—ప్రహ్లాదుని తల్లి.



శ్రీ

# ప్రహ్లాద

## ప్రథమాంకము—ప్రథమరంగము

స్థలము:—వైకుంఠము

[జయ, విజయులు ద్వారమువద్దఁ బ్రవేశించుచున్నారు.]

జయ—సోదరా !

మ. తొలి జన్మంబున నెట్టి గొప్పతపఁ మొకొ జ్జేసియున్నామొ? యీ
లలితాకారునిఁ భక్తవత్సలుని లీలామానుషున్ విష్ణు భూ
వలయాధీశుఁ గృపాలవాలుని మహాభాగ్యున్ రమాకాంతుని
న్గొలువన్ సార్థకమయ్యె జన్మము సదానూనప్రభారశ్మి చేన్.

విజయ—అగ్రజా !

తే. గీ. ఈవు చెప్పినయట్లు రాజీవ నేత్రు
చరణరాజీవములఁ గొల్చు సత్ఫలంబు
పూర్వ పుణ్యావశంబునఁ బొందినాము
విష్ణు, రోచిష్ణు గరుణచే విమలకీర్తి!

(తెరలో సనకసనందుల గానము.)

[తెరవైపుఁజూచి]

మ. కనుఁగొంటే? మును లెవ్వరో యిటకదే కంజాతుని జ్జూడఁగా
మనమందు న్గడు నుత్సహించుచుదగన్ మార్గంబునన్ వచ్చుటల్

**జయు**—గినుగొంటివే మఱి వారలిద్యోడ మనఃశోకోత్సాహాతోదారులై
వనజాక్షుఁ హరిదర్శనంబునకునై

**విజయు**— శ్రీ వాంఛించుచున్నట్లొప్పెడిన్.

**జయు**—సోదరా! లక్ష్మీకాంతుఁడు తన రామామణింగూడి కేళీమందిరంబున వినోదాంబుధి నోలలాడుచుఁ దలంచి లోనికి నితరులరా నీయవలదని యాజ్ఞాపించెనుగదా ?

**విజ**—అగును. అయిన నిప్పుడేమి?

**జయు**—ఇప్పు డీ ఋషిపుంగవుల నెట్లు లోనికి విడుతుము?

**విజ**—నిన్నెవరు విడువుమనిరి ?

**జయు**—ఒకానొకవేళ యీవచ్చెడిమునిపుంగవులే మనమనుకొనిన యట్లు లోనికింబోనీయుఁడని కోరిన నేమిసేయుదము ?

**విజ**—దానికింత తడవుకొనవలయునా? ఇందిరామనోహరునాజ్ఞ లేనిదే మిమ్ముల విడువనొల్లమని పల్కెదము.

**జయు**—మునులు ముక్కోపులని విందుముగదా? వారివాక్యంబుల కడ్డుపల్కినను, వారినడ్డగించినను, మనల ఘోరంబుగ శపించెదరేమో?

**విజ**—భయంబువలదు. మురహరునాజ్ఞ మనకున్నదికదా? అద్దానిని వారలకుం దెల్పిన శపింపరని తలంచెద.

[సనకసనందులు ప్రవేశించి లోనికిం బోఁబోవుచుండఁగా]

**జయు**—(అడ్డముగాఁజని) పుణ్యమూర్తులరగు నోతాపసవర్యులారా! పద్మనాభుండు తన పద్మాయతాక్షిం గూడి యున్నవాఁడు గాన లోనికిం బోవలనుపడదు.

**సనకు**—ద్వారపాలకులారా! మేమెప్పుడెట్టియసమయంబున వచ్చినను నిరభ్యంతరముగా లోనికేగెడివారమే! నేఁడీయభ్యంతర మేమి?

**విజయు**—మునిచంద్రులారా! అబ్జనేత్రుండగు నయ్యనంతుని యాజ్ఞయే కారణము.

సనంద—ఏమంటివి. భగవంతుని యాజ్ఞయే కారణంబనియా? ఆభగవంతుఁడే మేమేసమయంబున వచ్చినను నిరాఘాటంబుగా లోనికి రాననుజ్ఞనిచ్చెనే? అమ్మహానుభావుని తొలి యాజ్ఞయే సెల్లవలయును. అదియునుంగాక నీ రెండవయాజ్ఞ మాపట్ల వినియోగింపఁబడదు. కాన మమ్మడ్డగింపక దారితొలంగిపొండు.

(అని లోనికిం బోఁబోవుదురు.)

(జయవిజయు లడ్డముగావచ్చి నిలిచెదరు)

సనంద—నఖలుసాహసమ్. నఖలుసాహసమ్. (అని భయపెడుదురు.)

సనకు—(కోపముతో) ఓరోరి క్షుద్రులారా! ఏమిరా మమ్మవమానపఱచుచుంటిరి? వైకుంఠంబున విష్ణుసాన్నిధ్యంబున నుంటిమని గర్వించెదరా దుర్మతులారా! నిష్కారణము మాకోపాగ్నికింధనములుగాకుఁడు. తత్‌క్షణమే దారితొలంగుఁడు.

జయు—మహాత్ములారా! స్వామియాజ్ఞలేనిదే మిమ్ములవిడువనొల్లము. నిష్కారణము మమ్ములశపింతురు. స్వామియాజ్ఞయే లేకున్న మిమ్మడ్డగింప మేమెంతవారము.

సనకు—స్వామివలన మీకపాయంబు వాటిల్లకుండఁ గాపాడెదము. సహిష్ణుండైన విష్ణువు మా నియాజ్ఞోల్లంఘనముఁ జేయనొల్లఁడు గదా? కాన విచారింపక దారితొలఁగుఁడు.

సనంద—జయవిజయాభిధానులారా! ఇమ్మహానుభావుండు చెప్పిన యట్టుల మీకపాయం బిసుమంతయు రానీయక గాపాడెదము. భయంబువలదు. కృపాయత్తచిత్తుండగు నప్పరమేశ్వరుండు మావాక్యంబుల న్విని మిమ్ము సైరింపకఁపోడు. మేమా దామోదరు నిప్పుడవలోకింప వలయుఁగాన మఱుమాటఁబల్కక దారిదొలఁగుడు.

జయ—మునిపుంగవులారా! పద్మనాభుని యాజ్ఞోల్లంఘనముం జేయ మేమెంతటివారము? మీయాజ్ఞ జవదాటితిమని మాపై నలుగకుఁడు. మీరు సుడివినయటులఁ జేయసమర్థులేయని మే మెఱుంగుదుము. గాని రాజీవనేత్రుని యాన నిరాకరింప మామ నంబంగీకరింపకున్నయది. కాఁబట్టి మమ్ములమన్నించి మీమార్గంబున మీరు బోవుటధర్మము.

సనంద—ఏమంటివి. ఆదిదేవుండైన యనంతుని గొల్వ సమకూడెనని మహాగర్వంబునఁ గన్నును మిన్నును గానక మాకు ధర్మోపన్యాసముఁ జేయఁ బ్రారంభించితిరే? మువ్వాటికిని దారి దొలంగితీరవలయు. అట్లు తొలంగెదరా? లేదా?

సనక—ఏ మాకండకావరము. సరియే యాలోచించెదము. ముందా ప్రశ్నకు సమాధానంబిండు.

జయ—మహానుభావులారా! మీరడిగినప్రశ్న కిదివఱకె యుత్తరం బొసంగితిమి. అదియే మువ్వాటికిని నిజము. స్వామియాజ్ఞ లేనిదే మిమ్ములను లోపలకుమాత్రము బోనీయము. అనుజా! అంతియేకాదా?

విజ—అగ్రజా! అంతియే.

సనక—అట్లయినయెడ మే ముపేక్ష వహింపరాదు. (కోపముతో)

తే. గీ. ఔర! దుర్మతులారా! మ ॥ మ్మలఁతిఁ జేసి
తొత్రవనిడమంచుఁ బల్కిన ॥ దుష్టులార!
యిదిగో శాపంబు నిచ్చెద ॥ మింక మీర
లసురులగుచును జన్మింపు ॥ డవనిమీఁద.

జయ-విజయ—(ఏకకంఠ్యముగా) హా! మాధవా!! రక్షింపుము. రక్షింపుము. (అని నిర్వాఅపోయిచూతురు.)

[తెర లేచును]

[లక్ష్మి పాదములొత్తుచుండఁగా శేషశయ్యపైఁ బన్నుండి విష్ణుమూర్తి ప్రవేశించుచున్నాఁడు.]

మునులు—(స్తవముచేయుదురు.)

విష్ణు—(మునులంజూచి లేచివచ్చి నమస్కరించి) మౌనిచంద్రులారా! అభివందనమాచరించుచుంటి గైకొని నన్నుఁ గృతార్థునిఁజేయుఁడు.

సనక-సనంద—జగత్కల్యాణున కనంత కల్యాణము లగుఁగాక.

జయు—దేవా! తమయనుజ్ఞ మెయి మే మీద్వారంబునఁ గొలువుండఁగా నిమ్మునీశ్వరులు లోనికింబోవుచుండ మేము వలదన "అసురులగుమను జన్మింపుఁ డనని మీఁద" అని మమ్ము శపించిరి. మాధవా! మాకేదిదిక్కు? నీయాజ్ఞయే లేకున్న మాకీ మునిశార్దూలంబుల శాపప్రాప్తి లేకుండ నుండునుగదా? ఇంతకుఁ బురాకృతకర్మ మిటులున్నదికాఁబోలు. దేవా! మాయీతప్పు సైరించి మమ్మీ శాపంబుననుండి తప్పింపుఁడు.

సనకు—జయవిజయులారా! కడచినదానికిఁ జింతించిన నేమిప్రయోజనము. శాపముతోడ శాపోదకములు గ్రహించి జల్లుటయే మావంతయ్యెనుగాని నయ్యది మాన్ప మాతరముగాదు. సరేకదా బ్రహ్మరుద్రాదులకైన శక్యముగాదు. కోపావేశంబున మే మెన్ని యక్షరంబులుబల్కితిమో యన్ని యక్షరంబులునుం జెల్లవలయునేకాని వేఱొండుగాదు. కాఁబట్టి మీయాశ నిరాశయయ్యెనని విచారింపకుఁడు.

విష్ణు—సేవకులారా! ఇమ్మహానుభావుండు జెప్పినది నిక్కవము. ఇటువినుండు. మీశాపవిమోచనంబున కేనొక్క మార్గంబారసితిని. అయ్యది కడుంగడు సులభంబయియుండె. అదేమన

నాతో నెయ్యంబున సప్తజన్మంబులైనను, కయ్యంబున త్రిజన్మంబులయినను, మీరనుభవించితిరేని మీకీశాపవిమోచనం బగు. కావున నీరెంటియందును మీకెయ్యది యిష్టమో యెఱుంగఁజేయుఁడు.

జయు—పరాత్పరా! భవదీయ పాదసేవ జేయకుండ సప్తజన్మంబు లేము తాళఁగలమా? మధుసూదనా! నెయ్యంబుగాని కయ్యంబయినను సరియేగాని, మీచెప్పినచొప్పున త్రిజన్మలనుభవించి నీచే హతులమయి నీసాన్నిధ్యముం జేరఁగలమను యాస జనించుచున్నయది. కాన నోభక్తజనపారిజాతమా! మాకుఁ ద్రిజన్మంబులే దయచేయఁగోరుచున్నాము.

విష్ణు—అట్లయిన నోజయవిజయులారా! తొలిజన్మంబున హిరణ్యాక్ష, హిరణ్యకశిపులై జన్మింపుఁడు. హిరణ్యాక్షుండు వరాహావతారంబునను, హిరణ్యకశిపుండు నారసింహావతారంబునను నాచే మడియుదురు. రెండవజన్మంబున రావణకుంభకర్ణులై జన్మంబుఁగాంచి రామావతారంబున నాచే హతులయ్యెదరు. మిగిలిన జన్మంబున శిశుపాల దంతవక్త్రులయి జన్మించి కృష్ణావతారంబున నాచే మడియుదురు. తదనంతరంబ మీకీశాపవిమోచనంబగు. ఇయ్యదియ మీశాపవిమోచనానుక్రమంబు

సనంద—మాధవా! నీయూహ కడుంగడుశ్లాఘాపాత్రముసుమా!

విష్ణు—జయవిజయులారా! ఆలసింపక మీరేగి దితి కశ్యపప్రజాపతులకు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జన్మింపుఁడు. కాలహరణంబుగాకుండ వేగముగఁ బొండు. ఋషిపుంగవులారా! లోనికిం బోదము రండు. (అని నిష్క్రమింతురు.)



## ద్వితీయరంగము.

స్థలకము—హిరణ్యకశిపుని సభ.

[హిరణ్యకశిపుఁడు, శంబరుఁడు, విప్రజిత్తి, యుచితాసనములపైఁ గొలువుదీర్చియుందురు.]

హిర—మంత్రీ! విప్రజిత్తీ! ఏమంటివి?

తే. గీ. చెలఁగి మీయాజ్ఞ వినినంత శీఘ్రగతిని
మూఁడులోకంబులనుగూడ దాడి వెడలి
నిమిషమాత్రంబులోనఁ దా నిగ్రహించు
హేమలోచనుఁ డుండెన హీనబలుఁడు.

అనియా! ఏమీ! లోకంబులు లెక్కింప మూఁడేనా! అంతకెక్కుడు లేవా?

శంబ—తండ్రీ! ఆ వనజగర్భునిచే సృష్టింపఁబడినవి లోకత్రయంబులే; అంత కెక్కుడు కానరావు.

హిర—ప్రెగ్గడా! విప్రజిత్తీ! కుమారా! శంబరా!

శా. ఔరా! యావిధి సృష్టిఁజేయమను దా నాలోచనన్జేసి, యా
రారా! లెక్కకుమూఁడులోకములె దానానాము సృష్టించెనే
క్రూరాత్ముండయి వాఁడు; లోకవితతిం గోట్లాదిఁ గల్పింపకే,
దూరాలోచన లేని వాఁ డెటు సమర్థుండౌను సృష్టింపఁగా.

శంబ—

మ. పుడమీశా! తమకేటికిట్టులలుగ న్బోవనింకఁ; యా ధాత, దాఁ
గడువృద్ధుండయినాఁడు గాన జగము ల్గల్పింపఁగాలేని యా
నలువన్దిట్టిన లాభమేమి కినుకన్? నా మాట లాలింపుఁ డి
య్యెడలోకంబులు మూఁడు జాలవొకొ? మీకేరింపొందఁగానేలినన్.

హిర—(ఆశ్చర్యముతో) ఏమీ! విచిత్రము. సింహాముఖుడుపున చెవుల

పిల్లిబుట్టినదే? బావురపిల్లినిజూచి మాతంగంబు బెదరినట్లు ముదుకండగు నావిధాతనుగూర్చి నీవును బెదురుచుంటివా? మనవంశంబునం బుట్టిన పంచవర్షంబుల బాలుండైన నిట్టి పిఱికి మాటలాడునే? (కోపముతో) ఛీ! ఛీ!! నీజన్మంబువలన యు ష్మజ్జనకుండగు హిరణ్యాక్షుని పేరుప్రతిష్ఠ లడుగంటుచున్నవే? ఎన్నఁడైన నిట్లు పిఱికివై మాట్లాడితివే?

శంబ—జనకా! ఏమంటిరి. ముదుకండును, విశేషించి మనకుఁ బితామహుండును నగు సర్వజగద్భర్తను నిందించిన లాభమేమంటిని గాని మఱియొండుగాదు. మఱియు మనపితామహునితప్పు మన మే సైరింపనియెడల నింకెవరు సైరింతురు? విశేషించి బంధుప్రేమ నన్నుఁబట్టి బాధించుటచే నట్లంటిని. లేకున్నచో బంధుప్రేమ నొకమూలకుం ద్రోసివైచి యమ్ముసుకని కరచరణంబులు బంధించి సృష్టికర్త్రభిధానంబు మీకొసంగకుందునే? బాంధవుండు గావునను, వృద్ధుండుగావునను వాని నుపేక్షింపవలసి వచ్చె గాని లేకున్నచోనా—

హిర—(సంతోషముతో) మేలు. శంబరకుమారా! మేలు. నిజముగా నీ యీ వాక్యంబులవలన నా సోదరుండగు హిరణ్యాక్షునకును, విశేషించి మాకును, నెక్కుడగు గర్వము జనించుచున్నది. నీబంధుప్రేమ శ్లాఘాపాత్రముగదా! (ఉలికిపడి యెడమకన్ను దరుటసూచించి) అరరే! ఏమిది? నేఁడీ యనిమిత్తంబులు గల్గుటకేమికారణము.

శంబ—(తొందరగా) జనకా! ఏమట్లనుచుంటిరి?

హిర—కుమారా! ఏలకో యకస్మాత్తుగ నిట్టుండి వామనేత్రభుజంబు లదరుచున్నయవి. పురుషున కుత్తరభాగం బదరిన విశేషారిష్టంబుకల్గుననియు, దక్షిణభాగంబదరిన మిక్కిలి శుభప్రాప్తియగుననియు,

మనపెద్దలు పల్కుచుందురు. నేఁడదేరీతి నావామపార్శ్వం బదరుచున్నది. మదీయసోదరుఁడు హిరణ్యాక్షుఁడు ఘోరారణ్యంబుల వేఁటాడనేగి పదునుదినములయియుండినను, యింకను గ్రమ్మఱి రాకయున్నవాఁడు. కారణం బేమియుం బొడఁగానకున్నది. వానియొద్దనుండి సమాచారంబైనను రాలేదు.

[ప్రవేశము: దుర్ముఖుఁడు.]

దుర్ము—దేవా! జయము. జయము. యువరాజుగారితో వేఁట కరిగిన యలంబాసురుం డరుదెంచి భవద్దర్శనార్థమయి ద్వారముకడ వేచియున్నాఁడు. ఏమియాజ్ఞ?

హిర—త్వరితగతి వానిప్రవేశము నడుపుము.

దుర్ము—చిత్తము. (నిష్క్రమించును.)

హిర—అమ్మయ్య! (అనినిట్టూర్పువిడిచి) నా సోదరుని క్షేమసమాచారంబులేమియుఁ దెలియుటలేదని విచారించుచుండఁగా సమయంబున కీయలంబాసురుం డరుదెంచినాఁడు. ఈతనివలన సకలవృత్తాంతం బెఱుంగవచ్చును. ఈతనిరాక శుభావహంబగుఁగాక.

[ప్రవేశము: దుర్ముఖుఁడు-అలంబాసురునితో.]

దుర్ము—దేవా! ఈతఁడే యలంబాసురుఁడు. నే సెలవుఁగైకొని ద్వారముకడకుఁ బోయెదను.

హిర—మంచిది.

దుర్ము—చిత్తము. (నిష్క్రమించును.)

హిర—అలంబాసురా! వేఁట విశేషంబు లేమి?

అలం—దేవా! మే మట్లు తమయొద్ద సెలవుఁ గైకొనినపిమ్మట యువరాజయిన హిరణ్యాక్షుండు గుఱ్ఱము నెక్కి బయలుదేఱఁగానే మిగిలినరాచకొమరులందఱు, జడలు లోపలనడఁగునటుల తలగుడ్డలతోఁ బెనచి పాగలుచుట్టుకొని, చల్లడములు దొడిగికొని,

దట్టీలుగట్టికొని, యాదట్టీలలో బాకులందోపుకొని సాళువము, బైరి, యణుజు, ఓణము, జాలె, తోఁచిగాఁడు, వేసము, లగుడు, మొదలగు పేరెక్కిన డేఁగలందిసికొని, వానిందువ్వి వేఁటకై బోరేపించుచు యువరాజునకు ముందుగానడువనారంభించిరి. మిగిలిన మఱికొందఱు భౌంభౌం భయంకరార్భటీదీర్ణదిగ్భిత్తులై చెలఁగు కత్తెరసంపంగి, హనుమంతి, వాయువేగి, వత్సనాభి, బూఁచిగాఁడు, భైరవుఁడు, మెండిగుండు, మిత్తిగబ్బి, యను జాగిలంబులందోడ్కొని వివిధమృగవిహగవధం బాచరింపఁ గుతూహలంబున నమ్మహారణ్యంబుసొచ్చి మునుముందు డేఁగల న్విడచి పూరేడు, కౌజు, చెలగువ్వ, కల్లేఁడు మొదలగు విహంగంబుల న్మడియింపఁజొచ్చిరి. ఇంతలో వేఁటకుక్కలన్నియు మహారణ్యమధ్యంబునంజొచ్చి గోరింద, గేదంగి, మోదుగు, కనుము, కానుఁగు మొదలగు పొదరిండ్లమాఁటునం డాఁగిన క్రూరజంతువుల నదలింపఁజొచ్చినవి.

హిర—తరువాత, తరువాత ?

అలం—అటుతరువాత నోదనుజనాయకా ! భౌం భౌమ్మను వేఁటకుక్కలయార్భాటములచేతను, డప్పుల చప్పుళ్ళచేతను, మన సైనికుల కేకల చేతను, నమ్మహారణ్యంబునంగల మేటి మృగంబులైన చిఱుఁతపులులు, మాతంగంబులు, బెబ్బులులు, పింగదృష్టులు, వేయేల ప్రాణముగల సమస్తజంతువులును [illegible] స్వనంబుల ఘూర్ణమానంబులై పడుచునుండ, నయ్యాదికని మనసైనికులెల్లరుఁ గడుంగడు ముదమందుచు మిగుల నట్టహాసంబులఁ జేయుచు విల్లెక్కు పెట్టువారును, కత్తి, కేడెము, మొదలగు నాయుధ సాహాయ్యమునం బరుఁగిడువారునై క్రూరజంతు సంతానముల నదరుమువారునై యుండిరి.

హిర—తరువాత తరువాత ?

అలం—తరువాత నో దైత్యాధినాథా! యువరాజయిన హిరణ్యాక్షుండు కొండగుహలో డాఁగి కనుగ్రుడ్లుత్రిప్పిత్రిప్పి ప్రాణాపాయంబగునన్న భయంబునఁగూర్చుండి చూచుచున్న బెబ్బులింగని దానిం బొలియింపనెంచి విల్లెక్కువెట్టి వాఁడికోలతో నేసెను. దేవా! ఏమిచెప్పుదును? ఆ మువ్వన్నెమెకం బాయేటుఁ దప్పించుకొని యాబాణంబుతోడనే పైకెగసి మిక్కిలివడిగా యువరాజు మీఁదికి న్దుముకఁ జొచ్చె.

హిర—(గద్గదస్వరముతో) తరువాత తరువాత ?

అలం—తరువాత నోశూరకులావతంసమా! యువరాజయ్యది గని జంకక, వెనుకంజవేయక, ధైర్యంబువీడక, యలుఁగుఁ ద్రొడుగుటయు, వేయుటయుఁ గనురెప్పపాటు కాలంబులో జరిగె. విధివశంబున నయ్యేటునుం దప్పిపోవుటయు, నబ్బెబ్బులి యినుమడించిన రోషంబున యువరాజుపై కుటికె. అయ్యదికని మన సైనికులెల్లరును గన్నీరు మున్నీరుగాఁ గారనేడ్చుచు యువరాజు చచ్చెఁ జచ్చెనని విలపింపఁజొచ్చిరి.

హిర—(విచారముతో) హా! దితికుమారా! హా! కశ్యపప్రజాపతియనుంగుతనయా! నీకింతలోననే నూఱేండ్లునిండెనా? హా! సోదరా! సోదరా!! హేమలోచనా!!! భుజబలశౌర్యరాశీ! మల్లయుద్ధప్రవీణా! ఎంతదురవస్థ వాటిల్లెనురా తమ్ముఁడా! (అని అలంబాసునితో) అలంబాసురా! అటుపిమ్మట నేమిజరిగెను?

అలం—అటుపిమ్మట నో దేవా! యువరాజగు హిరణ్యాక్షుఁడా చారలమెక మేటుతప్పి తన ప్రాణంబుల న్దీయ వచ్చుచుండెనని గ్రహించి, చేతి కైదువుంగైకొని, మొక్కవోని తనశౌర్యంబును హెచ్చరింపన్జేసి యొక్కయేటున దానిఁ దుత్తునియలట్లంజేసెను

ఆఘాతంబున కాఘాతుకమృగంబు లచ్చటి కొండల నడిమి గొందులు ప్రతిధ్వనులిచ్చునట్లొక యఱపఱచి చచ్చెను. తోడనే మన సైనికులెల్లరును జయజయధ్వానంబులు మిన్నొగయ నార్చుచు భళీ! హిరణ్యాక్షా! భళీ! హేమలోచనా! యని యుగ్గడింపఁ జొచ్చిరి.

హిర—(సంతోషముతో) బాగు. సోదరా! బాగు. రాక్షసకులంబున కెంతయు వన్నె దెచ్చిన నీకు శుభంబగుఁగాక. అలంబాసురా! తదనంతరం బేమి జరిగెను?

అలం—అట్టిసమయంబున నామహారణ్యంబంతయుఁ గలయందిరిగెడు జంతువు లాకూరార్భాటమువిని తమపసిపాని తోఁకలను ముడుచుకొని దారినెఱుంగక పోయెడి సివంగులును, కొండలపై కెగఁ బ్రాఁకఁదలంచి ప్రాఁకుచు మధ్యభాగంబునఁ జాఱఁ బ్రాఁకి యక్కడనుండి క్రిందకుఁ బడియెడి యెలుంగుల గుంపులును, తమ పిల్లలను గర్భంబున నంటిపెట్టుకొనునట్లొనర్చి యీ కొమ్మనుండి యాకొమ్మకును ఆకొమ్మనుండి యీకొమ్మకును బరుగిడు ప్లవగీకదంబమ్మును, తమస్థానంబులువీడి పరుగిడెడు పందులగమియు, నిద్రాహారంబులంద్యజించి పులి, కరి, కిరి మొదలగు మృగంబు లన్నియుఁ బరుగిడనారంభించెను. అట్టి తరుణంబున మేమొనర్చిన చప్పుళ్ళకు జడిసి హరిణంబొక్కటి వేఁటకుక్కలకుఁ జిక్కక, కాళ్ళు నేల సోకనీయ కాకాశంబున కెగిరిపోవుచుండెనో యనునట్లు పోవుచుండఁగా మిగిలిన తన తోడివారలకు తన సామర్థ్యముఁ జూపఁదలంచి యదియెగిరిన సమయంబున నొక్కటిగాఁ జేర్పఁబడిన కాళ్ళగిట్టల నొక్క వాఁడికోలతోఁ జూచువార లత్యాశ్చర్యమ్ముం బొంద యువరాజు దెగనేసె.

హీర—బాగు. సోదరా! బాగు. నీవేటనేర్పుంజూచు భాగ్యము నా కన్నులకు లేకపోయెఁ? అయిననేమి? నావీనులు తద్వృత్తాంతం బంతయు వినుచుంటచే ధన్యతవహించె తరువాత తరువాత?

అలం—తరువాత నోదానవకులశ్రేష్ఠా! వేటకాండ్రు తరుముటచే వేయుకేకలను మోరంపైకెత్తికొని బాగుగానాలించి తమ్ము తరుమువచ్చు వేటకుక్కలలోఁ జొరఁబడి యొకటిరెండు శ్వానంబుల మాంసపుకండలు దేహములనుండి తెగిపడునటు లొనరించెడి సూకరంబుల నిలకించి వారీటెలచేతను, బల్లెములచేతను, వానిని జంపఁజొచ్చిరి. మనసైనికుల బాణఘాతంబులకు సూకరంబుల దేహంబులనుండి వ్రేలాడు ప్రేవులు వ్రేలాడు చుండఁగా వేటకాండ్రబారినుండి తప్పించుకొనం దలంచియు పారిపోలేకపొదలంజొరఁబడి బలహీనతనొందియుఘుర్ఘురధ్వానంబులుగొనపాకుకొనకూర్చుండి, వేటకాండ్రనుదగ్గరకురానీయకుండఁ గాపాడుకొనుచుండెనో యనునట్లు భయంకరావృత్తిం దాల్చిన కన్నులనుండి విస్ఫులింగంబులు జలజలరాల్చుభంగి, మమ్మందఱఁ జంపివేయునట్లు తమ యెఱ్ఱనిచూపులు మాపైఁ బ్రసరింపఁజేసినవి.

హీర—ఏమీ! అరణ్యాంబంతయు నంత భయంకరముగానున్నదా? అలంబాసురా! తరువాత తరువాత?

అలం—తరువాత నోప్రభూ! యువరాజద్దానింగని, యెక్కువెట్టినవిల్లును, బాణంబులతో నిండుకొనియున్న యమ్ములపొదియుం దాల్చి, యమ్ములపొదిలోని బాణంబులం బెటికి చేతఁదీసికొని, యెల్లదిక్కులం గలయంజూచి, మిగిలినవారందఱు తనవలెనే కట్టాయితమై నిల్చుటంగని మనమున సంతసించి బాణమేయందలంచి విడువగా నబ్బాణంబు దూరంబుగానున్న సూకరంబులకు

ద్దగులుటకు మారుగా పదిగజంబుల మేరలోఁ బడియె. విల్లు హస్తంబులనుండి హఠాత్తుగా క్రిందంబడియె. వెంటనంటియున్న సహస్రాక్షుఁ డదిగని "దేవా! ఏలయిట్లా విల్లుఁ గ్రిందఁబడవైచితి"రని యనఁగ "సహస్రాక్షా! నేఁడ దేలకో గాని యెన్నఁడు లేని యశుభంబులు గానవచ్చెడిని. వామభుజంబును, నేత్రంబును, తొడయును గూడఁ గంపింపఁదొడఁగె. విశేషించి భుజంబదరుటచేఁ బట్టుతప్పె. అయినను నిట్టియనిమిత్తంబులకు హిరణ్యాక్షుండు వెనుకంజ వేయునే?" అని వేగ మఱల విల్లుం గైకొని, యమ్ములందీసికొని, యొకదాని వెంబడి నొకటిగ ననేక బాణపరంపర లాసూకరంబుపైఁ గురిపించె.

హిర—ఏమి నాసోదరుని ధైర్యము! తరువాత తరువాత?

అలం—తరువాత నో దానవనాయకా! అట్లా బాణఘాతంబున ననేక సూకరంబులు రూపుమాసినవి గాని, గమికి కన్నాకయి నిలిచిన సూకరంబుమాత్రము మడియక, రెట్టించినకోపముతో "తగరు కొండను దాఁకినవిధంబున" యువరాజుపై కుఱికె దాని కా యువరా జింతయు జంకక కత్తినెత్తి నఱుకఁబోయెను గాని యాపంది యొక్క కొమ్మునకుందగిలి యాకత్తి తుత్తునియలయ్యెను. వేఱొంకఖడ్గంబు గ్రహించుటకైనను దగిన యదను దొరకదయ్యె. భీతిల్లక ముష్టియుద్ధమునందు మిగులఁ బ్రజ్ఞావంతుఁడగుటచే హస్తంబుల వాకుందారము నెత్తి గిరగిరం ద్రిప్పి యొక బండరాతి నేసికొట్టెను.

హిర—(సంతోషముతో) ఆఘాతంబున నాసూకరంబు వలిపడిచచ్చెనా? లేదా? వేవేగఁ దెల్పుము.

అలం—దేవా! అట్లేల జరుగును? విధివిధానము వేఱైయుండ మన మనుకొనిన విధం బెన్నఁటికైనం జరుగునే? ఆఘాతంబున నా కిటి

యిసుమంతయున్లోంగక వెనుదిరిగి యువరాజుపైకుఱికి తన కొమ్ముతో యువరాజుం బైకెగురవేసి బాలుండు బంతి తూలించి తూ-లిం-చి-తూ-లిం-చి—(అని విచారము సూచించును.)

హిర—ఓరీ! అలంబాసురా! ఊరకుంటివేమి? నామనం బూరక తామరాకులోని జలముంబట్ల తల్లడిల్లఁజొచ్చె. నాయనుజునిదెస నేమియుపద్రవంబు మూఁడెనో వేగఁ దెల్పుమురా?

శంబ—అలంబాసురా! నాజనకున కెట్టియవస్థ తటస్థించెనో వేగఁ దెల్పుము.

అలం—(తలవ్రాల్చి విచారము సూచించును.)

హిర—ఓరీ! ఏమట్లాలోచించుచుంటివి? త్వరితగతి జరిగిన వృత్తాంతముం జెప్పరాదా?

అలం—అటులాయువరాజును తూలించి, తూలించి, తుదకాతనిఁ గ్రిందఁబడవైచి తనకొమ్ముతో వక్షస్థలం-బు-నుం-జీల్చి-చీ-ల్చి—(రోదనముఁ జేయుచున్నాఁడు.)

హిర—అలంబాసురా! ఇఁకవినుట చాలును. (విచారముతో) హా! తమ్ముఁడా! నీకెంతముప్పువచ్చినది. హా! హా!!

సీ. లలి గశ్యపబ్రహ్మ । కులవార్ధిచంద్రమా!
దనుజసంతతి బాసి । తరలినావె?
అన్నపై నెంతేని । మన్నన విడనాడి
స్వర్గంబుఁ జేరితే । శౌర్యవార్ధి!
పతియె దైవమటంచు । భావించు నీనాతి
విడిచి యేగితె వెల్ప । వెలఁదిఁగవయ
అల్లారు ముద్దైన । పిల్లవానిని వీడి
దివి కేగియుంటివే । దితికుమార!

తే. గీ. బహుళభువన ప్రశస్త దోర్గర్వల వితాన
పృథులతా లవిత్రము! భుజావిపులదర్ప!
తుదకు నొక పందిపోటుచేఁ దొలఁగినావె
తమ్ముఁడా! బ్రహ్మవ్రాఁతను దాఁటలేక.

శంబ—(విచారముతో) హా! జనకా!! ఎట్టి గబ్బిబెబ్బులులనైనను దబ్బిబ్బుపడునటు లొనరించినిబ్బరముగా చూచువారలబ్బురమందునటులా బెబ్బులులంబడఁద్రొబ్బెడిబాహుబలశాలి పీవాతుచ్ఛ సూకరంబునకుఁ బ్రాణంబులర్పించితే? హా! తండ్రీ! నాకేది దిక్కు? నన్నెవ్వరుపోషింతురు. అయ్యో! జననీ! నింటివే? నిన్నును నన్నును దిక్కుమాలినవారిఁగా నొనరించి నీమనోహరుం డస్తమించెనను ఘోరవార్త.

హిర—ఓ సోదరా! సోదరా!

మ. పుడమి జ్ఞాపగఁ జుట్టినాఁడవుగదా? ప్రోద్దామ శౌర్యంబునన్
వడిగా శత్రులఁ జంపినాఁడవుగదా? పల్మారు ధైర్యంబుతో
నడవిన్ గ్రూరమృగాళిఁజంపితిగదా? హా! యంత్యకాలంబునన్
జెడు కుందారము చేతఁ బాసితిగదా? జీవంబుల న్దమ్ముఁడా!

అయ్యో! నీచకుందారం బేడ? భవదీయ ప్రాణాపహరణంబు గావించు టేడ? నమ్మఁజాల. నమ్మఁజాల.

విప్ర—దేవా! బాలుఁడైనశంబరాసురుని, యబలయైనమీామఱఁదలిని, మీాయంబయగు దితిని, నూరడింపవలసిన తమరే యిట్లు శోక సముద్రమందున మునుంగఁదగునే? తత్త్వమరసిచూడ బంధుమిత్రాదులు ఋణానురూపసంబంధులుగదా? "ఋణానుబంధరూపేణ పశుపత్నీ సుతాలయాః" అను వాక్యంబు మీారు వినలేదా? మఱియు,

సీ. పంచభూతంబుల ౯ బ్రాభవంబునఁగల్గు
గేహంబుగాదె, యీ ౯ దేహ మరయఁ?
బూర్వకర్మముచేతఁ ౯ బొందిలోఁ బ్రాణంబు
దగనిల్చి యొకవేళ ౯ తరలిపోవు
నూహింప చెడునది ౯ దేహ మొక్కటె గాని
యాత్మ నాశముఁ జెందఁ ౯ దసురనాథ !
యాత్మయు, దేహంబు, ౯ నరయంగ ద్వివిధంబు
గాని, యేకత్వంబు ౯ గానరాదు

తే. గీ. ఋణము దీరినవెన్క దా ౯ నింకఁ దుదకు
నొక్క నిముసంబయైనను ౯ నుండ దాత్మ
యద్దెకొంపల కైవడి ౯ నమరియున్న
కేవల శరీరములఁగూర్చి ౯ కించ యేల?

వెండియుఁ గాలముదాపురించిన నేప్రాణియునిలువదు. శమనుని యాజ్ఞయైనచోఁ బోవకతప్పదు. కాఁబట్టి యట్టిదేహముంగూర్చి చింతించుట వెఱ్ఱితనముగాదే? యువరాజుగారి మరణవార్త న్విని మాబోంట్లమే కడుంగడుదుఃఖంచుచుండ, నేకగర్భసంజాతులరగు తమకు దుఃఖంబుండదని పల్కఁజాలము. ఎంతదుఃఖంబున్నను దిగమ్రింగి యూరకుండవలసినదేగాని వేఱొండులాభంబు గానరాదు. ఎంతకాలంబు విచారించియైనను పోయినప్రాణంబులు మఱలఁ దెప్పించినవారలుగలరే? ఎవ్వఁడయినను విచారించి పోయినవారితోఁగూడఁ బోవఁగలఁడే? కాన మీరు మీకును, సూకరంబుచేఁ బ్రాణంబులం గోల్పోయిన యుష్మత్సహోదరుండగు హేమలోచనునకును సంబంధబాంధవ్యంబు లేమియు లేవని మీమతియందు ధృతింబాదుకొల్పి చింతఁదక్కి

యుండుఁడు. ఎంతచింతించినను గతించిన నీసోదరుని యుసురులు తిరిగిరావు గదా?

అలం—దేవా! నా చెప్పవలసినదించుక గల దద్దానిఁగూడ వినుండు.

హిర—(విచారముతో) అలంబాసురా! ఇంక నేమిమిగిలినదో త్వరిత గతిం దెల్పుము.

అలం—దేవా! అట్లాసూకరం బాయువరాజు ప్రాణంబులఁ దీసికొని ప్రేవులు తన కొమ్ముసందగిలించి. మహారోషంబున నీడ్చి—

హిర—ఓరీ! ఏమిరా! ఇదివఱకే విచారాంబుధిలో మునిఁగి పరితపించు చున్న మాకు మాసోదరు బఱవన్మరణముఁగుఱించి యేమేమి యో గొప్పగాఁ జెప్పచుంటివి? ముఖ్యముగాఁ జెప్పవలసిన దెద్దియేనియున్న సంగ్రహముగాఁ జెప్పుము.

అలం—దేవా! అటులయిన వినుండు. వధ యైన తరువాత నాసూకర మే చూచువార లత్యాశ్చర్యంబాదునట్లుగా జగద్దేదీప్యమానంబైన కాంతి ప్రసరించుచు, శంఖ చక్ర గదా శార్ఙ్గ ఖడ్గంబులతోడను, చతుర్భుజంబులతోడను, పీతాంబరములతోడను, నీలమేఘచ్ఛాయనుమించుశరీరకాంతితోడను, నిజస్వరూపంబున విష్ణువు ప్రత్యక్షంబయి యిట్లనియె. "ఓరోరి దుర్మతీ! ముష్కరాధముండవై భూదేవిని సిలుగులం బెట్టిన ఫలం బచిరకాలంబులోనఁ బొందితివి" తరువాత మఱిరెండు నిమేషంబుల కా విష్ణు వంతర్ధానంబయ్యె. పొలికలనిమాదిరిగా నయ్యరణ్యంబునఁ బ్రాణంబుగల జంతువు లెచ్చటనుగానరా వయ్యెను.

విప్ర—దేవా! అలంబాసురుని వాక్యంబు లాలించి యాలోచించి చూచినచో దనుజకులమర్దనుఁడగు జనార్దనుఁడే భవదీయసోద

రుని ప్రాణాపహారణంబుఁగావించెనని నిశ్చయింపవలసివచ్చుచున్నది. లేదేని పందియేడ? హేమలోచనుని ప్రాణాపహారణంబుగావించుటేడ?

హిర — విప్రజిత్తీ! నీమాటయే సత్యము. ఓరా! మాయలమారీ! దుర్మదవిహారీ! కుటిలమార్గంబుననేగాని న్యాయమార్గంబున శత్రుప్రాణంబులన్ద్రియుట నీ శక్యముగాదటరా? దొంగపోటుగావచ్చి శత్రునాశముంగావించు నీవేటి మేటిబాటువురా? నీకు నిక్కమైన పౌరుషమేగలదేని ఖడ్గము చేతఁబూని ముఖాముఖిని సమరమున్జేసిన బలాబలంబులు తెల్లమయ్యెడినే? ఏటికిట్లు పనికిమాలినపనిచేసితివిరా! పిఱికిపందా!

విప్ర — ప్రభూ! ముఖాముఖింబోరుట కాతఁడు సమర్థుఁడుగాఁడు. కనుకనే నీచమగురూపమునుండాల్చి హేమలోచనునిసంహరించె. బాహుబలం బిసుమంతయేనిలేని యాపిఱికిపంద మీమొ్రలఁగాని,మీసహోదరుసమక్షంబునఁగాని నిల్చుటకాతండోపునే?

హిర — మంత్రీ! విప్రజిత్తీ! బలపరాక్రమసంపద లిసుమంతయేని లేని యాపిఱికిపంద శత్రునాశముగావించుట కిట్టి తుచ్ఛరూపము మున్నెన్నండైనఁ దాల్చెనని వింటివే?

విప్ర — దేవా!

మ. వినలేదే తమరెన్నఁడీ చరిత? మా శ్రీవిష్ణుండు మాయావియై
కన వేదంబులు బ్రహ్మకీయ మది సంశ్రీకల్పంబుల్రో మండఁగా
విని సంద్రంబున భీరువట్లుడంగ, నా శ్రీవీరుండు వారాసిలో
మన వంశస్థుని సోమకాసురుని దా శ్రీమ్రగ్గించఁడే మీనమై.

హిర — ఏమీ! అమ్మాయకాఁడు నాసోదరుని మడియించుటే గాక మనవంశస్థుండగు సోమకాసురునింగూడ మడియించెనా? అటులయిన నావేషధారి నడఁగఁద్రొక్కువఱకు నాప్రాణమ్మారట్లఁ

చెందదు. కాఁబట్టి నాతమ్ముని కుత్తరక్రియలు జరిగించినమఱు నాఁడే బయలుదేరి మందరాద్రికిం జని యహోరాత్రంబు లేక దీక్షతో నిద్రాహారంబులం ద్యజించి, హంసవాహనునిం గూర్చి తపం బాచరించి, పెక్కువరంబులం బడసి, యటుపైని నాసోదరుం జంపిన యామోసకానిం ద్రుంచెద. అప్పుడు నామనంబు ననున్న నుమ్మలికం బఱంగు.

విప్ర—దేవా! మీయూహ కడుంగడు సమంజసముగానున్నది. ఉత్తమపురుషలక్షణంబు లట్టివియేగదా? శత్రుప్రాణాపహరణంబు గావించుటయే యుత్తమముగాని యూరక వాపోవుటవలన లాభంబులేదుగదా? కాన మీచెప్పినచొప్పున తపంబాచరించి మీయిష్ట దైవంబగు కమలాసనునివలన వరంబులం బడసిరండు.

హిర—మేలు. మంత్రీ! మేలు. విప్రజిత్తీ! నాయుద్యమంబునకుం దగిన వాక్యంబులఁ బ్రోత్సాహపఱచినందులకే నెంతయు నంతసించుచుంటిని. (శంబరునితో) కుమారా! శంబరా! నీ వీమంత్రి సత్తముండగు విప్రజిత్తి యాలోచనప్రకార మీరాజ్యభారము వహింపుము. గతించిన నీజనకునికై కడుంగడు గుందకుము. నీ జనకుని ప్రాణంబులపహరించిన యాజడమతి ప్రాణంబులఁ దీయువఱకు నాకు నిద్రాహారంబులపై నిచ్ఛ జనియింపదు. కాన నావాక్యంబు లాలించి యట్లొనరింపుము.

శంబ—తండ్రీ! భవదాజ్ఞానువర్తినై మెలంగెద.

హిర—మంత్రీ! విప్రజిత్తీ! కుమారా! శంబరా! అమ్మాయకాఁడు యజ్ఞంబులయందును, బ్రాహ్మణులయందును, విష్ణుభక్తులయందును, ఋషులయందును నుండునని తొల్లి శుక్రాచార్యుండు చెప్పఁగా వినియుంటిని. కాఁబట్టి నేఁ దపంబునకరిగిన వెనుక మన

సైనికులంబంపించి, యాయనామధేయము డంతరించునటు లా భూలోకంబంతయు నాశంబొనరించుమని నాయాజ్ఞగాఁ దెల్పుఁడు. పుత్త్రశోకంబున మునింగి పరితపించుచున్న మజ్జనని నూరడింపవలయుఁగాన కుమారా! శంబరా! పోవుదముర మ్ము. మంత్రీ! నీవు పొమ్ము.

విప్ర—మహాప్రసాదము దేవా!

(నిష్క్రమించుచున్నాఁడు)

హిర—కుమారా! రమ్ము. (ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

---

తే. గీ. ధరణి నయినాపురపు వంశ తల్లజులగు
బాపరా ట్సత్యమాంబల వరసుపుత్త్రుఁ
డలఘు సుకవి సోమేశ్వరా హ్వాయునిచేత
వ్రాయఁబడె నిది భూమిపై వరలుఁగాత.





శ్రీ

# ప్రహ్లాద.

## ద్వితీయాంకము—ప్రథమరంగము.



స్థలకము—అరణ్యము.

[ముందు ఖడ్గధారుఁడై యింద్రుఁడును, వెనుక లీలావతి
యును ప్రవేశించుచున్నారు.]

లీలా—(తనలో నాథునుద్దేశించి విచారముతో) హా! నాథా! నాథా!
హేమకశిపూ! ముల్లోకంబుల నల్లలాడించెడి బాహుబలశాలీ!
దనుజనాయకా! మనోనాయకా!

చ. మది నిసుమంతయైన నను మానముఁ జెందక నింద్రుఁడకటా!
వదినెయనంగ తల్లియని భావమునం దలపోతమాని, నీ
సుదతిని నన్నుఁబట్టి మన సోకుల నెల్ల వధించి వేగ నా
సదనమునుండి దెచ్చె నిటు స్వర్గముఁ జేర్పఁగ దుష్టబుద్ధియై.

హా! నాథా! ఇంక నాగతి యేమి? అయ్యయ్యో! శంబరకుమారా!
మంత్రీ! విప్రజిత్తి! మీకందఱకు నియామకుండగు హిర
ణ్యకశిపుని పట్టమహిషిని. లీలావతి యనుదానను. మీరైన
నన్ని విపత్తునుండి గాపాడరారే? అయ్యయ్యో! ఏమి నావెఱ్ఱి?
కరచరణబంధంబు గావింపఁబడిన మీ రెట్లు నన్నుఁ గాపాడె

దరు? హా! భక్తజనవశీకరా! నా మొఱాలింపవా? భవదీయ కరుణారసవిశేషాంబువులం దడియుందలంచి యస్మన్మనోహరుం డల మందరాద్రిపైం దప మాచరించుచున్నవాండే. అట్టియెడ నీకూర్మిరుం డరుదెంచి వావివరుసలనైనం గణింపక నన్నుం జెఱంబట్టనుంకించెనే! ఆపన్నయై విలపించుచున్న నన్నుం బ్రోవ నీకిది సమయముకాదా? కోరినతడవుగ వరంబులిచ్చుటయే నీవంతు గానియార్తరక్షణపరాయణుండవుగావా? హా! హంసవాహనా!

సీ. సహధర్మచర్యలన్ ౯ సతతసేవలం జేయు
భాగ్యంబు పతియెడం ౯ బడయనింక
కొమరుండుగల్గి యీ ౯ కువలయంబును నేలు
ననుమాట కలలోని ౯ దయ్యెనింక
నగుంబాటుం జెందక ౯ నల్వురి లోపల
తలయెత్తి తిరుగుట ౯ గలుగదింక
సద్రిచు లెందఱో ౯ సౌభాగ్యగతితోడం
బోరిం జెడిభాగ్యంబు ౯ వోయెనింక

తే. గీ. ఎవరిం బ్రార్థింతు? మ్రొక్కెద ౯ నెవరికిపుడు?
ఎవరు ప్రోతురు కరుణతో ౯ నింక నన్ను?
పాకశాసను నిమ్యోడం ౯ బాఱందోలి
లీలం గాపాడు వారలు ౯ లేరె భువిని?

(ప్రి) ఓ! వజ్రాయుధస్ఫారపరిశస్తహస్తా! పాగ్దిశాధీశా!

మ. దితిపుత్రుండయొ లేనివేళంగని నా ౯ దీమంబున న్జొచ్చి, నీ
చతురత్వంబును జూపి నన్నకట! నీ ౯ స్వర్గంబున న్జేర్పంగా
దితిజశ్రేణిని బల్మిబట్టి చెఱ బం ౯ ధింపంగ నీకౌనె? నా
పతి విన్నన్ నినుంబట్టి యాడ్చి వెస నీ ౯ ప్రాణంబుల న్దీయండే?

బలసూదనా ! స్వర్గమర్త్యపాతాళలోకంబుల కధీశ్వరుండవయి, విశేషించి యన్యదిక్పాలక సేవితుండవయి, పదుగురిలో తగుమనని తలయెత్తికొని న్యాయపరిపాలకుండనని చెప్పికొని తిరిగెడి నీవే యిట్లు పరకాంతలం బల్మిఁగైకొనఁజూచుటఁ బాడియా? సంక్రందనా ! నీ వెఱుంగని ధర్మంబులేమిగలవు? ఎవ్వఁడు తన కార్యకారణ సంఘాతమును వశీకరించుకొని, జితేంద్రియుఁడయి వర్తించునో వానికిఁగదా దేవత్వముగల్గును. జితేంద్రియుండవుగాని నీవెట్లు లింద్రుండవయితివో యెఱుంగరాకున్నది. మఱియు నోపాకశాసనా !

చ. వదినె యనంగఁ దల్లియను ♪ వావి యొకింతయునైనఁగాని నీ
హృదయమునం దలంప విది ♪ యెంతటిమూర్ఖత, చెల్లునయ్య ! నీ
కిది? పరకాంతనైన నిటు ♪ లేచుట భావ్యముగాదనంగ నీ
వదినెను బల్మిఁబట్టి పలు ♪ బాములుపెట్టుట నీకు ధర్మమే?

ఇంద్రు—సద్గుణకల్పవల్లీ ! తల్లీ !

ఉ. ఏటికి నిల్లు వేలవయి ♪ యీగతి జాలినిఁ దూలెదమ్మ ! నే
నేటికి నిన్ను ముట్టెదను? ♪ నెన్నఁడు నట్లు దలంపకమ్మ ! నా
మాటలు నమ్ముమమ్మ ! నిను ♪ మాతవిధంబుగఁ జూతునమ్మ ! నా
మాటలు తేటతెల్లమగు ♪ మాతరో ! స్వర్గముఁ జేరినంతనే !

లీలావతీ ! యుష్మన్మనోహరు నేనెఱుంగకపోలేదు. భవదీయప్రాణనాయకుండును, మేమును, బఱితపావనుఁడైన కశ్యపప్రజాపతి యనుంగుబిడ్డలమేయయినను, మమ్ముమాత్రి మాదితికుమారులు సోదరులట్లు భావింపక హృదయంబున లేనిపోని క్రోధముం బెంచుకొని మమ్ముఁ బెక్కుబాధలం బెట్టఁ జొచ్చిరి. అందులకు భవదీయనాథుఁడే తార్కాణము. దితికుమారులకును, అదితికుమారులకును, సఖ్యముబొసంగుట కలలోనివార్తయని యెఱింగియు

మిగులఁ గ్రూరుండయి వర్తించు నీమనోహరుండు నీ మఱఁదివలె జనార్దనునిచే మర్దింపంబడక మానఁడనియు, నీవు గర్భవతివిగాన నీకుం జనియించు బాలుండు తండ్రికన్న వేయిమడుంగు లెక్కుడు బాహుశాలియయి మమ్మందఱ నింతకంటె పదిరెట్లెక్కువ బాధించుననియు భయంబంది, చాలాలవగు నిన్నీ సమయంబునం గాని బంధించుటకువీలు లేదని యెఱింగినవాఁడనై చనుదెంచి నిన్ను బల్మిఁ బట్టి స్వర్గమునకు దోడ్కొని పోవుచుంటి నీకుఁ బాగండుఁడే గల్గిన వానిని సంహరించితీరెద లేదేని నీపుత్రికారత్నముతోఁగూడ నిన్ను నీప్రాణనాథుని చెంతకుఁ బంపించివేసెద. నాపల్కులు నమ్ముము. పరమపతివ్రతా శిరోమణివగు నిన్ను వేఱొండు దురుద్దేశంబుతో బలాత్కారముగాఁ దోడ్కొనివచ్చితినని యనుమానింపకుము. దేవదానవులకు మైత్రి పొసఁగుటాకాశహర్మ్యంబుగాన నీయెడ నిట్టి క్రౌర్యమొనరింపవలసివచ్చినందులకు నన్ను మన్నింపుము.

లీలా — శతధృతా! తొలుదొల్త నీ మనువుంగని నేనపభ్రమఁ జెంది నిన్ననేకవిధంబులఁ దూలనాడితిని. శతమన్యూ! నాతప్పు సైరింపుము. మఱియు నో యమరనాయకా!

సీ. ననుఁ బల్మిఁ బట్టెద • ననుకొంటి తొలుదొల్త
      నదిగాక నీవిప్పు • డంతకన్న
ఘనమైన కార్యమే • మనమునఁ దలపెట్టి
      చెఱఁగొని తెచ్చితే • శీఘ్రగతిని
పాగండునిం జంపఁ • బ్రాణముల్ నాయవి
      పోవక నిల్చుట • బొసఁగదయ్య!
శిశుహత్యకును దోడు • స్త్రీ హత్యయనుఁ గూడ
      బట్టి బాధించు జం • [illegible] నన్ను

తే. గీ. మాతవిధమునఁ జూతునన్ । మాట యిచ్చి
బాలకునిఁ ద్రుంతు ననిపల్కఁ । బాడి యగునె ?
సుతులఁ గనలేదె ? దయ లేదె ? । ప్రతిభతిలక !
నిర్ఘృణుని రీతిఁ బల్కఁగా । నిర్జరేంద్ర !

వెండియు నో సునాశీరా ! (విచారముతో బ్రతిమాలును)

ఉ. గర్భములోని పుత్త్రకుని । కాంతు వధింతు నటంచుఁబల్కఁగా
నిర్భర పుణ్యమూర్తివి, సు । నీతివి, నీకిది చెల్లునయ్య ? నన్
దుర్భరశోకవార్ధిఁ బడఁ । ద్రోయకుమయ్య ! భజింతునయ్య! నిన్
స్వర్భువనాధినాధ ! యన । వద్య కృపామతిఁ బ్రోవ వేఁడెదన్.

ఇంద్రు—లీలావతీ !

శా. చండక్రోధముతోడ దైత్యులు మముం । సంహారముం జేయ ను
ద్దండత్వంబునఁ జూచుచుండెడి మహో । దగ్రాత్ములౌ వీరినిన్
ఖండింప న్వలెనంచు నెంచితి మదిన్ । గాఠిన్యమే పార నా
యుండ న్బల్కకు బ్రోవుమన్న పలుకే । యబ్జాతపత్త్రేక్షణా!

మఱియు, నోయోషారత్నమా !

తే. గీ. దేవతలపేరుఁ జెప్పిన । నేవగించు
పరమమునులను గనుఁగొన్న । బాధపెట్టు
చెనఁటిదైత్యాధములఁ బట్టి । దునుము పట్ల
పాపమున్నను భయపడు । వాఁడఁ గాను.

కాఁబట్టి నీవు నాయెదుట నింకేమియుం బలుకక నావెనువెంటనే రమ్ము. మహాపతివ్రతవు, సద్గుణనికురుంబవు గాన నీకింతదూరము చెప్ప వలసివచ్చె. మఱియు,

తే. గీ. వక్రమార్గాన నడచెడు । చక్రపాణి
యైన దండనంబున కర్హుఁ । డౌననంగ

వసుధ బుట్టినదాదిగా నీ వక్రగతినె
నడచుచుండెడి మీవారి నీ విడువఁదగునె ?

కావున నోదైత్యేశ్వరీ! నీప్రార్థనలన్నియు నాయెడ వ్యర్థంబులయ్యెనని మదిఁ దలంకక ముందు నడువుము.

లీలా—ఓ! మహేంద్రా! (విచారముతో) కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబు లనుపాశంబులం దగులంజేయు రాజ్యముఁ బడయందలఁచి నీసమానులతో యుద్ధ మొనర్చి జయంబుగాంచవలెను. అందులకుం దగిన సమర్థత లేదేని యొక మూల నొదిగియుండవలయును. పురుషుండవయి జన్మించినం దులకు నీపౌరుషంబుఁ దగిన మగవారిపైఁ జూపినరాణించు నేగాని మావంటి యబలలపైనను, శంబరాదులవంటి బాలురపైనను జూపుటఁ బాడియా ? ఇదియేటి పౌరుషము; ఇదియేటి ధర్మము. రాజనీతి నీ వెఱుంగవే ? ఓ పాకశాసనా! సంతతిలేదని మంతనమున నింతింతనరాని పరితాపంబున మ్రగ్గుచుండఁగాఁ దుదకు పరమేశ్వరు కరుణాకటాక్షవీక్షణంబులు నేఁటికి నాపైఁ బ్రసరించి, నాకోర్కె ఫలించెనోయనునటుల గాహ్యాదముం దాల్చితి. నాకర్మము మూర్తీభవించెనోయనునటుల, నాపాలిఁటి మృత్యుదేవత సాక్షాత్కరించెనోయనునటుల, వడివడివచ్చి నా గర్భములోని బిడ్డనుం జంపెదననుచుంటివే ? స్వకీయపరకీయ భిన్నాభిప్రాయంబున నోరెఱుంగని పసికూనలం జంపుటేటి నీతి? అందు గర్భంబుననున్న నర్భకునింజంపు టేటిధర్మము? కఠిన హృదయుండవగు నిన్నేమనందును ? నీ హస్తమందున్న యా యుధమే వజ్రముగాని నీహృదయముగాదనుకొంటినే? నీపల్కు లశనిపాతంబులే? నిన్నెన్నివిధంబులం బ్రతిమాలినను నాయా రాటముఁ బాపవైతివే ? అట్లయిన నోసునాశీరా ! ఇటువినుము

నన్ను బంధిగముంచునిచిగదా నాకుఁ గల్గిన సుతుని సంహ రింతుననుచుంటివి? కన్నపుత్రునితోఁబాటు నేనును మడియుట నిక్కువముగదా? నేఁడు నీకంతశ్రమ లేకుండ నీవజ్రాయుధముచే నన్నే ఖండింపరాదా? నాచావుతో నీకోరికయు నెఱవేఱు? ఎట్లయినను శిశుహత్యయు స్త్రీహత్యయు నీకుఁ దప్పవుగాన నిట్లు చెప్పితిని. అట్లు చేసితివేని నాకుఁగలదుఃఖము త్వరలో రూపుమాపినవాడవగుదువు. బాలుంజంపఁ గృతనిశ్చయుండవై తివి గాన నా యీ చిన్నికోరిక నెఱవేర్పుము.

ఇంద్రు——లీలావతీ! భరింపరాని పుత్రశోకంబున నీవు మఱసినమఱ సెదవుగాక. నా వజ్రాయుధముచే ని న్నేటికి వధించెదను. నా వాక్యంబుల కడ్డుబల్కక నడుము. నడు నా కాలస్యంబగుచున్నది.

లీలా——(దైవమునుద్దేశించి) ఔరా! విధాతా! నీవెంతకైనం దగు దువు. సంతతికొఱకై వగఁజెందుచున్న నాకెంతయు నాసఁ గల్పించి, ముద్దుముచ్చటలైనం దీఱకమునుపే వైకుంఠరూపం బున నాశిశువు నపహరింపఁజూచితే? ఇంతమాత్రమునకే నా కింతయాసఁ గొల్పనేల? ఈగర్భోత్పత్తియే లేకున్న నేవిచార మును లేకుండ నుందునే? అయ్యయ్యో! నాకేదిదారి? ఎందుఁ బోదును? ఏమిచేయుదును? ఎవరు నన్నుం గాచెదరు? (బిగ్గరగా) ఈశ్వరా! మానీశ్వరులారా! మీరైనవచ్చి నాయీకష్టంబున కడ్డుపడరే?

క. పలుమఱుఁ బ్రార్థించినఁ దన
దలఁచినపని మానఁ డకట ♀ దర్పోద్ధతుఁడై
పొలఁతిని నన్నుఁ గావఁగ నీ
బలసూదను నుద్యమంబు ♀ వారింపరొకో?

[ప్రవేశము: నారదుఁడు]

నార—ఎవ్వరి దీయార్తధ్వని? (తేఱిపాఱిచూచి) ఇంద్రా! సద్గుణసాంద్రా! ఆగుమాగుము. ఏమిపనిఁగావించితివి? అబలల నిట్లేచ్చుట భావ్యమా? ఈమె రాక్షసాంగనయయ్యుఁ గడు నుత్తమురాలు. పతివ్రత. ఖ్యాతయశోలంబ. అట్టి తన్వియెడ నిట్టి క్రూర కార్యముఁ గావించుటేటికి? చాలు. చాలు. అవక్రవిక్రమ పరాక్రముండగు హేమకశిపుని యర్ధాంగియనియైన నెఱుంగ కెట్టి కార్యము గావింప నెంచితివి? ఇఁక నీమెను విడిచిపెట్టుము. (లీలావతిదిక్కు తిరిగి) అమ్మా! నీకేమియు భయంబులేదు. వగపుఁదక్కి యుండుము. భయంబులే దూఱడిల్లుమూఱడిల్లుము.

లీలా—మునిసార్వభౌమా! భవద్దాసురాలు లీలావతి యిదే ప్రణమిల్లుచున్నది గైకొనుఁడు. ఋషీశ్వరా! భవదాగమనముచే ధన్యురాలనయితిని. నాకష్టంబు గట్టెక్కె. నానోము ఫలించె. భవదనుగ్రహంబువలన నాప్రాణంబులు నిల్చినవి. మదీయప్రాణనాథుని వదనసందర్శనముఁ జేయఁగలనను ధైర్యముజిక్కినది.

నార—అమ్మా! పుత్రవతి వగుదువుగాక. భయపడకుము. నీమనోనాథు నచిరకాలంబులోననే చూడఁగలవు. నీకష్టంబులు గడచె, సుఖంబుగ నిల్లుచేరుము.

ఇంద్ర—సురమునీంద్రా! తమ రిట్లేల పల్కుచుంటిరో నేనెఱుంగంజాలకున్నాఁడను. నే నీమెయెడ ద్రోహంబేమియుఁ దలంచియుండలేదు. ఆ యంశం బీవఱకే లీలావతి కెఱింగింపఁబడియె. ఈమె మహాపతివ్రతయనియు, దుష్టరాక్షసుండగు హేమకశిపుని యర్ధాంగియనియు, నేనెఱుంగకపోలేదు. నాయుద్యమం బేదియో దేవర యెఱుంగ కిట్లసంగతంబుగా బల్కుట భావ్యమా?

నార—అట్లయిన నీమె నెందుల కిట్లు చెఱపట్టితివి?

ఇంద్ర—బ్రహ్మమానసపుత్రా!

కం. లీలావతి గర్భంబున
బాలుం డుదయించె నేని ❀ బాధించు నటం
చాలోచనమెయి నే న
బ్బాలుని వధియింప నెంచి ❀ బట్టితి ననఘా!

నార—(కొంతవడి దివ్యదృష్టిఁ దిలకించి యుపవారించి) మహేంద్రా! ఇటువినుము. హేమకశిపుని పుత్త్రుండైనను నిబ్బాలుండు పరమభక్తాగ్రేసరుండు. తత్త్వజ్ఞానసంపన్నుండు. నిర్మలుండు. మహావైష్ణవాంశసంభూతుండు. అట్టివాఁ డెట్లు నీకపకారంబొనర్చును. దానవకులము దుద్భవించుచుండె ననినంతమాత్రముననె వెఱపుఁగొనవలసినపని లేదు. నా వాక్యంబుల యెడవిశ్వాసముంచుము. మఱియు నీకింకొక్క పరమరహస్యం బెఱింగించెద. ఈ బాలుండు జన్మించిననేగాని హేమకశిపుఁడు మడియఁడు. హిరణ్యకశిపుఁడు జగత్కంటకుఁడు. వానికుమారుఁడు విష్ణుభక్తుఁడగును. హిరణ్యకశిపుం డిపుడు మందరాద్రిపైఁ దపం బాచరించుచున్నవాఁడు. వాణీమనోహరునివలన దుర్లభంబులగు వరంబులఁ బొందితీరును. భగవద్దూషణ మొనరించిననేగాని వాఁడు మడియఁడు. అందువలననే కుమారుండు విష్ణుభక్తుండుగాన విష్ణువుని భజింపవలదని కుమారుని దండించును. అనేక బాధలం బెట్టును. తన భక్తుండగు బాలునిం బాధించెనన్న రోషంబున నాదిదేవుండగు విష్ణు వా రాక్షసాధముని—(అని యిటు నటుంజూచి) ఈచుట్టుప్రక్క లేరును లేరుగదా? మహేంద్రా! ఇది పరమరహస్యంబుగానుంచవలయుఁజుమా? ఇఁక వినుము. ఆ రాక్షసాధముని నారసింహావతారంబున నంతంబొనరించును. హిరణ్యకశిపుని మరణం బీరీతిగానుండుటచేతనే యీపా

గర్భంబున భగవంతుండగు నయ్యనంతుని భక్తుం డుదయించుచుండె. కాఁబట్టి నీమె నిటడించి హేమకశిపుని మరణంబునకై యెదురుచూచుచుండుము. పొమ్ము.

ఇంద్రు—(అపవారించి) సురమునీంద్రా! సంతసించితిని. మహాత్మా! మహామహుండగు నాదిదేవుని భక్తుం డీమె గర్భంబునం జనియించునని యెఱుంగక యపచారం బొనరించితి. నాతప్పు సైరింపుఁడు. భవదాజ్ఞానుసారంబుగా మెలంగెద. (కొంచెము దగ్గఱగాఁ జని) ఋషిపుంగవా! ఎంతకాలంబున కారాక్షసాధముం డంత మొందును? ఎఱింగింపఁదగు నేని నామనశ్శల్యమయిన యీయంశ మెఱింగింపఁ బ్రార్థితులు.

నార—(అపవారించి) సహస్రాక్షా! కాలనిర్ణయముం జేయ నవకాశము చాలదు కాని—(చెవిలో చెప్పుట భినయించి ప్రకాశ) మహేంద్రా! నా కనుష్ఠానంబునకు వేళ యతిక్రమింపఁ జొచ్చె. కావున నీవిఁకఁ బొమ్ము. ఈమెతో నే వెడలెద.

ఇంద్రు—(ప్రకాశముగా) తాపసోత్తమా! నిష్కారణము తమ రేల శ్రమ గైకొనవలయును? తమరు సెలవొసంగెద రేని మరల నీమె గృహంబున నీమె నుడించి నా పట్టణంబున కేను పోయెదను.

నార—వలదు. వలదు. నీదారిని నీవు బొమ్ము.

ఇంద్రు—చిత్తము. (అని లీలావతిదిక్కై) అమ్మా! లీలావతీ! నన్ను మన్నించి నాకు సెలవొసంగితి వేని పోయెద.

లీలా—మహానుభావా! శతమన్యా! నాయందు నిప్పటికైనం దయ దలంచితి వంతియే చాలును. భవదీయానుగ్రహంబువలన నా శిశువు నాకుఁ దక్కె, సంతసించితిని.

ఇంద్రు—మునిపుంగవా! నమస్కారము. సెలవుదయసేయుఁడు.

నార—ఇష్టఫలసిద్ధిరస్తు. మంచిది. పోయిరమ్ము.

ఇంద్రి—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

లీలా—(సంతోషముతో) మునీంద్రా! భవదీయకరుణా విశేషంబే మని పొగడుదును. వజ్రహృదయుండగు వజ్రపాణిహస్తంబుల నుండి సునాయాసంబుగా నన్నుఁగాపాడితిరి. తమయనుగ్రహాము కతంబున మఱల భూలోకంబునఁ బునర్జన్మముఁ గంటి. ఋషి పుంగవా! మఱల బాటమధ్య నిబ్బలారి యడ్డుకొని నన్నుందో డ్కొనిపోకుండ సురక్షితంబుగా నామందిరముం జేర్చి నాకొలది మర్యాదలం గ్రహించి నన్ననుగ్రహించుఁడని వేఁడుచున్నాను.

నార—అమ్మా! లీలావతీ! నీమనంబున నట్టి సంశయంబువలదు. శత మన్యుం డిఁక నిన్ను బాధింపఁడు. నీమనోహారుండు తపో మహాత్మ్యంబున సత్యలోకాధీశుని నొప్పించి దుర్లభంబులగు పెక్కువరంబులంబడసి గృహంబున కచిరకాలంబులోననే రానై యున్నవాఁడు. నీప్రాణనాథుండు గృహంబునకు వచ్చినవెం టనే నిన్ను నీ గృహంబునకుం జేర్చెద. అంతదనుక నీవు నాయా శ్రమంబుననే సుఖంబుండువుగాని రమ్ము.

లీలా—తాపసాగ్రగణ్యా! భవదాజ్ఞానువర్తినినై మెలంగెద.

నార—అటులయినఁ బోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

స్థలము:—నారదాశ్రమము.

[లీలావతి శయనించియుండఁగా, నారదుం డిటునటు నడయాడుచుఁ బ్రవేశించుచున్నాడు]

నార—మఱియు నాదిమధ్యాంతరహితుండగు నమ్మహావిష్ణువే సుర గణంబులకును మహర్షులకును నాదిదేవుండు గాన నజుండనియ్యు,

ననాదియనియు తురీయరూపుఁడై యజ్ఞానతమోభాస్కరుండగు నమ్మహేశ్వరుండనియు నెవ్వఁ డెఱుంగునో యాతఁడే సమ్మోహము లేనివాఁడగుటవలన సమస్తపాపంబులచేతను విముక్తుఁడగును. సుమనోమార్గంబుల కచింత్యంబయిన యాచిదానందుని లలితాధ్యాత్మికవిషయజ్ఞానసంపత్తియే పాపసంహరణోపాయనంబుగాఁ జెప్పంబడియె. సంసారరహితునకుఁ గర్మకృతమయిన యచిత్సంసర్గమే జన్మము. కార్యకారణావస్థమగు నచేతనముకన్నను బద్ధముక్తమగు చేతనముకన్నను నీశితవ్యమగు సమస్తముకన్నను నిఖిలహేయప్రత్యనీకానవధికాతిశయకల్యాణైకవితానుం డగుటచేతను నియమనైక స్వభావుండగుటచేతను యితర సజాతీయుఁడను మోహము లేనివాఁడై యెవ్వఁడు పరమాత్మనెఱుంగునో యాతఁడే సర్వపాపంబులచేతను విముక్తుండగును. వెండియు సర్వప్రాణంబులకును బుద్ధి, జ్ఞానము, అసమ్మోహము, క్షమము, శమము, దమము, సత్యము, దుఃఖము, సుఖము, భావము, అభావము, భయము, అభయము, అహింసము, సమతము, తుష్టి. తపస్సు, దానము, యశము, అశయంబులగు నిరువది భావంబులును భగవంతుని యనుగ్రహంబువలననే కలుగుచున్నయవి గావుననే యమ్మహానుభావుని లోకమహేశ్వరుండని యెఱుఁగుము. (మధ్య మధ్య ఊఁ. ఊఁ. అను ధ్వని వినంబడునటు లభినయించి తేఱిఁ బాఱిచూచి) ఏమిది, లీలావతి సుషుప్త్యవస్థం దగిలియున్నదే? నాతత్త్వబోధ న్వీని యెవ్వ రీయూఁకొట్టుచుంట? (అని యిటునటుఁజూచి) ఈచుట్టుప్రక్క లేరునుగాన రారే? (అని దివ్యదృష్టిఁదిలకించి) హే! మహానుభావా! లీలావతీ గర్భంబునం బ్రవేశించి నీవేనా నావాక్యంబులాలించి

యూఁకొట్టుచుంట? ఓ పరాత్పరా! ఆదిమధ్యాంతరహితా! నిత్యానందపయఃపారావారంబున నోలలాడించెడి పరమాత్మ స్వరూపకా! నీ వుపదేశించిన యంశంబులనే నావలన వినఁ గోరుచున్నాఁడవా? అట్లయిన వినుము వెండియు, నమ్మహా విష్ణువే పరబ్రహ్మము. సర్వజగత్తునకుం గారణభూతుఁడు. ఆతని వలననే వికారరూపంబయిన సర్వజగత్తును బ్రవర్తించుచున్న యది. అమ్మహాతేజశ్శాలియందుననే భక్తినుంచి, సర్వేంద్రి యంబులుఁగూడ నాతనియందు నిలిపి యమ్మహానీయ వర్ణనా పూర్ణులై యప్పరమాత్మనే యొండొరులకు బోధించుచు, తమ తోడివారల కుపదేశించుచు నిరంతరము సంతోషించువారలకే సుఖముగలదు. అట్టిసుఖమే సుఖము. ఆ యానందమే బ్రహ్మా నందము. భగవద్భజనమునందు సాధనమును సాధనాంతరముం గూడగలదు. అట్లమ్మహావిష్ణుని సంతత మేకాగ్రతగలవారలై పరమప్రీతితో నుపాసించి యెవ్వరు భజించుచుందురో వారల కాపరమాత్మ తన్నెఱుంగుటకు సాధనమైన బుద్ధియోగంబు దయసేయును. ఎవ్వరు భగవంతునియం దేకాగ్రమయిన బుద్ధిగలవారలై స్వార్థపరోన్నత్యాదులగువాని నపేక్షింపక ప్రీతిపూర్వకముగ సేవించుచుందురో యట్టివారి కచింత్యం బయిన సమ్యగ్దర్శనమును దయసేయును. అట్టివారినే యనుగ్ర హించుటకై భగవంతుం డెప్పుడును వారి యంతఃకరణవృత్తి యందే వసించుచుఁ బ్రకాశమానంబగు జ్ఞానదీపముచే వారి యవివేకజన్యమగు మిథ్యాజ్ఞానం బను నంధకారమును నాశన ముంగావించి బుద్ధియందుఁ బ్రకాశించు పెన్వెలుఁగను జ్ఞానమ్ముం దయసేయును. నాలుగు వేదంబులలోనను వీణామృదుధ్వానం బుచే మిక్కిలి రమణీయమగు సామవేదంబును సర్వ దేవాధి

పతియగు వైకుంఠేశుండును, పదునాకం డింద్రియములలో ప్రవర్తకమైన మనస్సును, సర్వప్రాణి సంబాధములగు పరిణామములలో జిదభివ్యక్తమైన బుద్ధివృత్తియు భగవంతుండగు విష్ణువేయని యెఱుంగుము. (అని యిటునటుంజూచి) ఓహో! అప్పుడే సాయంసమయము గావచ్చినదే? ఇఁక నే నరిగి కాల్యకృత్యంబుల నెఱవేర్చికొందుఁగాక. హే మహానుభావా! మిఁగిలినయంశంబులు తే పుపదేశించెద. ఇప్పటికి నాకు సెలవు దయసేయుము. (నిష్క్రమించుచున్నాఁడు.)

## తృతీయరంగము.

స్థలకము:—హిరణ్యకశిపునిసభ.

[హిరణ్యకశిపుఁడు, శంబరుఁడు, విప్రజిత్తియు నుచితాసనములపైఁ బ్రవేశింపుచున్నారు.]

విప్ర—దేవా! తదనంతరం బేమిజరిగెను?

హిర—తరువాత నాతపస్సున కలరి యాస్వాయంభువు సాక్షాత్కరించి "హిరణ్యకశిపూ! నీతపంబున కే నెంతయు న్మెచ్చితి. నీ కిష్టంబగువరం బెద్దియో వాంఛింపు మనియె.

శంబ—(సంతోషముతో) తండ్రీ! అప్పుడు మీరు నాతండ్రింజంపిన యా మాయాకారుని జయించునట్లు వరంబడిగితిరని తలంచెద.

విప్ర—కుమారా! తపంబునకై వెడలినదే యందులకు గదా?

హిర—కుమారా! శంబరా! మంత్రీ! విప్రజిత్తీ! యట్లుకాదు. నే నడిగిన వరంబులవలన సమస్తమయినవారినిం గెలిచెదను. ఆ విష్ణు వొక్కండే యన నేల? త్రిభువనంబులయందును నన్నెదిర్చి పోరంగల ధీరుం డొక్కండైన నుండునే?

శంబ—అట్లయిన నవ్వరంబు లెవ్వియో వినఁగోరెదము.

హిర—మంచిది. వినుండు.

"శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములన్ దమఃప్రభల భూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేనిజీవనము లోకాధీశ! యిప్పింపవే?"

(భాగవతము.)

మఱియు, రణముఖంబున నాకెదురులేని ధైర్యస్థైర్యంబులును, దిక్పాలుర నెల్ల జయించునట్లును, లోకత్రయంబులయందును నాకెదురులేనట్లును, వరంబులంగోర హంసవాహనుండలరి "వత్సా ము న్నెవ్వరిట్టి ఘోరతపం బాచరించి యుండలేదు. ఇట్టివరంబులంగూడ బొందియుండలేదు. మహాతపం బొనరించి నన్ను సంతోషపరచితివిగాన నీకోరినవరంబులు నీకనుగ్రహించితి. బుద్ధిసంపన్నుండవై రాజ్యభారంబు వహించి సుఖంబుండుమని యానతిచ్చి యంతర్హితుండయ్యె.

విప్ర—వహవ్వా? మన మెంతయు నదృష్టవంతులము. ముల్లోకంబుల మనల నెదుర్చు దుర్జయు లుండరు. అట్లయిన దేవరవారికి సోదరుం జంపిన యాహరి మద మడంచుటకుఁగాను యుద్ధమునకై సంసిద్ధులరై యుంటి రని యూహించెదను.

శంబ—అంతకన్న కర్తవ్యం బేమిగలదు.

హిర—అగు నగును. నా యీ సంతోషకరం బైనవార్తను నా ప్రేయసికింగూడఁ దెల్పి, యాపైన దండయాత్రకుం బోవువాఁడను. కాన నే నంతిపురంబునకుఁ బోయెద. మీరు మీమీ నివాసంబులకుఁ బొండు. (అని లేచుచున్నాఁడు.)

శంబ——(హిరణ్యకశిపుని కాళ్ళపైఁబడి) తండ్రీ! పిఱికిపందలమై మా తల్లియగు లీలావతీదేవిగారిని పరుల కొప్పగించిన యానీచుల తప్పు మన్నింపుఁడు.

హిర——(నిర్ఘాంతపడి మహాకోపముతో) ఏమిరా! యీ దుర్భాషలు. నీతల్లిని పరుల కొప్పగించితివా? ఛీ! ఛీ! రాక్షసకులమును జెరుపఁ బుట్టితివా? ఆహా! తల్లీ! దితీ! నేఁటికి నీసంతతికి "పిఱికి" యను మూ డక్షరంబులు బహుమతిగా వచ్చినవి. ఔరా! శంబరా! కులంబునకెల్ల మచ్చఁదెచ్చి నీ వె ట్లీప్రాణంబులం భరియించి జీవించియుంటివిరా మూర్ఖా! (తలపంకించుచు) సరియేకాని ముం దీమాటఁదెల్పుము. హిరణ్యకశిపున కపకారం బొనరించి యమలోకమునకుఁ దోవఁ జేసికొనిన యాచెనఁటి యెవ్వఁడో ముందుగాఁ దెల్పుము.

శంబ——తండ్రీ!

మ. ఖలుఁడై దుర్మదచిత్తుఁడై విపులమా కామాతురుండై చు న
ప్పలుగాకైన బలారి వచ్చియు వెసన్ బాధించి మమ్మందఱన్
కలహంబందు నెదిర్చి పోరుటకు నో క్కండైన లేకుంటచే
లలనన్ దోడ్కొనిపోయె నక్కటకటా! లబ్ధవ్యమున్ బ్రభూ!

హిర——(కోపముతో) ఓరోరి! మహేంద్రా! నిన్నిదినములకే మఱియుం పక విడిచినందులకుఁ దగిన ఫలం బొనఁగూర్చితివి.

శా. దుర్జాతుండవు దుర్మదాంధుఁడవు బం ధుధ్వంసన్నిగ్ధుండవో
పర్జన్యా! మునిభార్యచందమున నా భార్యామణిన్ద్రుష్ప భా
ఖర్జప్రక్రియఁ బట్టినాఁడవుగదా గర్వంబుచే నింక నిన్
నిర్జింపన్వలె నిద్రబోవలయునో నిర్గంధ స్వర్గాధిపా!

విప్రజిత్తి! అద్దురాత్ముం డేయభిప్రాయంబున ననికి సిద్ధంబయ్యె. అతఁ డొక్కండు వచ్చి మిమ్మందఱ నిర్జించెనా? ఏమి యీవింత?

శత్రువులకుఁజడిసి ప్రాణంబులపైఁగల తీపిచేఁ బారిణంబుల నడ్కించుకొనిన మీవదనంబులు చూడరాదు.

విప్ర—మహాప్రభూ! మావాక్యంబు లించు కాలించినపిదప నీాయిచ్చ వచ్చిన ట్లొనరింపుడు. మే మెంతమాత్రము ప్రమత్తులమై మెలంగలేదు. కాని—

సీ. పర్జన్యుఁ డెంతయో । పంతంబుతోడ శి
లావర్షమునుగుప్పె । లాఘవమున
అగ్నిదాఁ జెలరేఁగి । భగ్నంబు గావించెఁ
గొంపలన్నియుఁగూడఁ । గూలునట్లు
నైరృతుం డక్కటా! । నైస్త్రింశికుండయి
పరిపంథినులనెల్ల । నఱుకఁజొచ్చె
యామ్యదిశాధీశుఁ । డయ్యారో పాశాన
దితిజుల ప్రాణముల్ । దీయఁదొడఁగె

తే. గీ. తక్కఁగల దిక్పతుల్ మమ్ముఁ । దరుముచుండ
నాజి వారలఁ గెల్వఁగా । నగునె మాకు?
నెట్టులున్నను త్రిదినంబు । లెట్టొ మేము
పోరియుంటిమి లేకుండఁ । బోయెఁ గెలుపు.

అష్ట దిక్పాలకు లేకమయి పట్టణంబెల్ల నల్లకల్లోలం బగునటు లొనరింపఁజొచ్చిరి. మా కోటమి సంభవించినంతనే మమ్ముల బట్టి బంధించిరి. తరువాత మరుసటి దినఁబున దేవిగారి చెలి క త్తియ యొకర్తు కాన్పించి దేవిగారిని "బలత్కారముగా సుత్రాముండు దోడ్కొనిపోయె"నని చెప్పె. మఱికొన్ని దినం బులకు మన సేనానాయకుం డగు సహస్రాక్షుం డరుదెంచి మమ్ముల బంధఁబుననుండి తప్పించె. అప్పటినుండియు మేలుఁ బనిచేయుచుంటిమి.

హిర—అట్లయినయెడ మీయం దిసుమంతయు నేరంబులేదు. (క్రోధముతో) అరరే దిక్పాలకులారా! ఏమిరా మీకంత కావరము. హేమకశిపుం డింకను జీవించియుండె నను మాట మఱచితిరే? కానిండు. మీరొనర్చిన దుష్కార్యమునకు దగిన ఫలం బనుభవింతురుగాని తొందరం జెందకుండు. (విచారముతో) హా! పురంధ్రీరత్నమా! లీలావతీ! దురాత్ముండగు సులూకునిహస్తంబులంబడి యింకను జీవంబులతో నుందువే? హా! మనోహారిణీ! నీవేమడసిన నాకీకాయముతో నేమిపని? అయ్యయో! పొగండుండో పుత్రికయో గల్గి యాయానందంబున మాతాశిశువు లుందురని కొండంతయాసతో వచ్చుసరి కశనిపాతంబువోలె నీఘోరవార్త వినంబడియె. హా! అర్ధాంగమా! నిన్నిజన్నంబునం జూచు భాగ్యము నాకు లేదే? హా! పద్మాయతాక్షీ! కమలాసనుం డిచ్చిన వరంబు లేరితోం జెప్పుదు? ఎవ్వరు విని సంతసింతురు?

విప్ర—దేవా! ఇట్లియ్యెడ విచారించిన నేమిప్రయోజనము? త్వరితగతి మీరరిగి నయ్యింద్రుని గర్వంబణంచి శ్రీదేవిగారిని దోడ్కొనివచ్చుట వీరపురుషోచితంబని తలంచెద. మీద దేవరచిత్తము.

హిర—విప్రజిత్తీ! శోకాంధకారంబున మునింగి పరితపించుచున్న నాకుం జక్కని యాలోచనం జెప్పితివి. మీరు మీమీగృహంబులకుంబొండు. నేనొక్కండ నరిగి సహస్రాక్షుని మదమడంచి వచ్చెద. (అని తొందరగాం బోంబోవుచుండంగా)

[దుర్ముఖుండు ప్రవేశించి]

దుర్ము—దనుజనాయకా! జయము. జయము.

హిర—ఓరీ! భార్యావిరహితదుఃఖాబ్ధి మునింగి పరితపించుచున్న మాకేమి జయంబుగల్గెనో వేగం దెల్పుము.

దుర్ము—దేవా! అమ్మగారగు లీలావతీదేవిగా రొక బాలకునితోడను యెవ్వఁడో యొక మునితోడను వచ్చి భవద్దర్శనార్థము ద్వారంబున వేచియున్నారు.

హిర—(సంతోషముతో) ఏమిరా! నిజముగా లీలావతియేనా! నీవు భ్రమజెందలేదుకదా! చెప్పుము. ఏమేమీ! నిజముగా నా బహిఃప్రాణమగు లీలావతియేనా?

దుర్ము—దేవా! దనుజకులకంఠీరవులగు తమతో మాటియొకలాగున మనవి యొనర్చెదనా?

హిర—ఓరీ! దుర్ముఖా! దుఃఖాంబుధిని మునింగియున్న మాకు సంతోషవార్తం దెల్పినందులకీ బహుమతిఁ గైకొనుము. (అని యొక రత్నహారమిచ్చి) వేవేగ వారి ప్రవేశము నడుపుము.

దుర్ము—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాడు.)

[ముందు లీలావతి పుత్రికునితోడను, వెనుక నారదుఁడును బ్రవేశింపుచున్నారు.]

లీలా—(హిరణ్యకశిపుం జూచి వడివడిఁ జని పాదములపైఁబడి కన్నీటితో) ప్రాణనాయకా! మీయర్ధాంగియగు లీలావతి యిదే ప్రణమిల్లుచున్నది కైకొనుఁడు. మనోహరా! మహామహుండగు నీనారదమహాసీంద్రుఁడు మనలకుఁ బెట్టిన పుత్రభిక్ష యిదే తిలకింపుఁడు.

సీ. ప్రాణేశ! నినుఁ జూచు ౯ భాగ్య మీజన్మంబు
నందు లేదం చెనఁ ౯ గుంది కుంది
తుదిసారి మనసారఁ ౯ బదముల కతిభక్తి
మ్రొక్కఁగాఁ గరములు ౯ మోడ్చి మోడ్చి
కడసారి నీమూర్తిఁ ౯ గాంచఁగా మది నెంచి
లలితాంగ దృష్టిని ౯ నిలిపి నిలిపి

నీపాద సేవయే నెమ్మితో నొనరింప
నాత్మేశ! యీదేహ మూపి యాపి
తే. గీ. బ్రతికి యుంటిని జీవచ్ఛవంబువలెనె
నారదాశ్రమమందు నో కూరిమిసఖి!
యిన్నినాళ్ళకు నాకోర్కె లెల్లఁ దీఱె
శారదానందను కృపాతిశయముకతన.

హిర—(బాలుని దీసికొని ముద్దుఁబెట్టుకొని) దానవకులోద్ధారకా! నీకు శుభం బగుఁగాక. (లీలావతీభుజములపైఁ జేయివైచి) మనోనాయకీ! కడచినదానికిఁ జింతింపకుము. చింతఁదక్కి యుండుము. మఱలఁ బ్రాణంబులతో మనమిరువురముం గలసికొంటి మంతియే చాలును. కాని నీయెడ నపచారంబొనరించిన యాదుండగునిమాత్రము సంహరించితీరెద. ఆయంశం బటుంచుము. ఏమంటివి? నారదమహామునీంద్రుని కృపాతిశయంబున మనకీపుత్రలాభంబు కల్గినదనియా? సంతోషము. సంతోషము. (అని నారదునిదిక్కు) నారదమహామునీంద్రా! ఇంకను నిలువంబడియే యుంటివా? ఇట కూర్చుండుము. దేవీ! నీ పీఠాసనం బధిష్ఠింపుము. (అని కూర్చుండి బాలుని ముద్దుపెట్టుకొనును.)

నార—దానవనాయకా! చిత్తము. (అని కూర్చుండును.)

లీలా—(కూర్చుండును.)

హిర—(తలపంకించుచు) నెచ్చెలీ! దుర్మదాంధుండగు స్వర్గాధిపుని బారినుండి యెట్లు తప్పించుకొంటివి? కఠినహృదయుండగు వజ్రపాణి నిన్నేమియుం బాధింపలేదుగదా? నారదుని సమావేశ మెప్పుడైనది?

లీలా—నాథా! నేను చెలికత్తెయలతోఁ బ్రమదావనంబున నుండఁగా

శచీనాథుం డరుదెంచి మిమ్మును, మీవంశంబును ననేకవిధం బులం దూలనాడి, నన్నుఁగూడ నిందించి —

హిర — ఏమేమీ! నన్నును నావంశంబును గూడ నిందించెనుగా? ఏమి వాని కండకావరము? (కోపముతో) ఓరోరిమహేంద్రా! నీవును, మేమును గశ్యపప్రజాపతిబిడ్డలమే కదా? తల్లు లిరువురు గాని తండ్రి యొక్కఁడే గదా? అట్టియెడ నావంగడమే చెడ్డ దైనయెడల నీవంశముమాత్ర మంత యుత్కృష్టమయినదేమి? ఛీ! ఛీ! నీతో నాకు వృథా కంఠశోష యెందులకు? నీగర్వం బు సర్వంబు ఖర్వంబుగా నొనర్పకున్న నన్ని హేమకశిపాభి ధానంబునం బిల్వకుము. తరుణీమణీ! తరువాత తరువాత.

లీలా — తరువాత నన్నుఁ జెఱఁగొనెదనని చెప్పుటతోడనే భయంబంది మూర్ఛిల్లితిని. తరువాత నేమయినదో నాకుఁదెలియదు. నాకుఁ దెలివివచ్చునరికి మహారణ్యమధ్యంబున నొక చెట్టునీడనుంటిమి. మృగరాజుమోలనున్న మృగశాబకంబట్లున్న నన్నుఁగని నడు వుమని నిర్బంధింపఁజేయునది లేక, వానింబ్రతిమాలుచు నడువ నారంభించితిని. నాప్రార్థనలన్నియు వానియెడ వ్యర్థంబులయ్యె.

హిర — (కోపముతో యింద్రు నుద్దేశించి)

శా. ధైర్యస్థైర్యము లేని యంగనలపై దర్పంబుజూపింపఁగాఁ
గార్యం బేమిర మూర్ఖచిత్త! ననుఁ దాఁకన్ నీదుశౌర్యంబు, నీ
శౌర్యంబున్ గనఁ దేటతెల్లమగురా! స్వర్గాధిపా! యింద్ర! నీ
క్రౌర్యం బెట్టిదొ నాకుఁ జూపుటకు రా రా! బాలిశా! వేగమే.

కానిమ్ము. నీమదము సదమదముఁ జేసితీరెద. తరువాత, తరువాత.

లీలా — తరువాత నాకుద్భవించెడి యీబాలుండు తనకపకారం బొన రించుననియు, కనుక నీబాలుని సంహరించిగాని నన్ను విడువ ననియు, అంతదనుక నన్నుఁ దప్పక బందిగ మందుంచుదుననియు

ఇఁక నన్నిదియో నిష్ఠురోక్తులంబల్కి తోడ్కొనిపోవుచుండఁగా, జేయునది లేక స్త్రీస్వభావంబగు దుఃఖంబునఁ బిగ్గఱగావిలపించం జొచ్చితి. నాయారవంబు వినిత్రిలోకసంచారియు, బ్రహ్మ మానసపుత్రుఁడును నగు నీనారదమహామునీంద్రుం డరుదెంచి, వానిని మందలించి వానితో నేదియో మంతనము సల్పి వాని చెడుభావంబును మాన్పించి వానింబంపించి నన్ను రక్షించె.

హిర—(సంతోషంబుతో) నారదమునివర్యా! మీరొనర్చిన యుపకారము కడుంగడుశ్లాఘాపాత్రముజుడీ! మీబంధుప్రేమ కేనెంతయు సంతసించితిని. మునీంద్రా! ఇంద్రునితో మీరొనర్చిన మంతనం బేమి?

నార—(తనలో) ఇప్పు డీతనితో నున్నదున్నట్లు చెప్పితినేని నాప్రాణంబుల కీదినంబుననే భరతవాక్యము జెప్పికొనవలసివచ్చును. ఏమిచేయుదును? (ఆలోచించి) సరియే. ఇట్లొనర్చెదఁగాక. (ప్రకాశముగా) దానవనాయకా! ఏవిధంబుగానైనను నీదేవి యగు లీలావతిని రక్షించెడితలంపున నానిదరిఁజేరి మహేంద్రా! హిరణ్యకశిపుం డనన్యసామాన్యుండనుకొంటివేమో? అతఁ డిప్పుడు మందరాద్రిపైఁ దపమాచరించుచున్న యంశం బీవెఱింగినదే కదా? ఆతఁడు చతురాననునివలన దుర్లభంబులగు వరంబులంగ్రహియించి కొలఁదికాలంబులోనే రానైయున్నవాఁడు. ఆతఁడువచ్చెనేని నీకును, నాకును, తక్కుంగలదేవతలకును, నిలువనీడ యుండదు ఏల యిట్టి తెలివిమాలినపని యొనర్చితివి? ఇప్పటికైనం బుద్ధి దెచ్చుకొని యీలీలావతి నిట డించి పొమ్మంటిని. ఆతఁడును నావాక్యంబులయందలి దృఢవిశ్వాసంబున నీమె నట డించి పోయెను.

హిర—మావంశంబునకును, నాకును, మిగుల ఖ్యాతివచ్చునటులను,

పాకశాసనునకు బుద్ధివచ్చునటులను సమయోచితంబుగా వానికిఁజెప్పి నాయర్ధాంగిలక్ష్మిని నాకొసంగిన మీకరుణావిశేషంబున కేనెంతయుఁ బాత్రుండను. ప్రియా! తదనంతరం బేమి జరిగె?

లీలా—ఇలూకుండరిగిన కొంతసేపునకు ధైర్యముఁదెచ్చుకొని, మునీంద్రా! నన్ను నాసదనంబునకుం జేర్చి, నాకొలఁది మర్యాదం గ్రహించి నన్నానందింపఁ జేయుఁడని యనేకవిధంబుల బ్రతిమాలితి. అంత నిమ్మునివరుం డట్లు గాక, నీవు తిరిగి పట్టణంబునకు వచ్చునటకును దనయాశ్రమంబుననే యుండుమని యాన తీయ వానిమాట కెనురాడనోపక యట్లే వాని యాశ్రమంబున నుంటిని.

హిర—నారదా! నీయాశ్రమమం దీమె నుంచుటలో నీయుద్దేశం బేమి?

నార—ఒకానొకవేళ మరల నింద్రుండరుదెంచి యీమెను దోడ్కొని పోవునేమో యను భయంబున నట్లొనరించితిని. నాయాశ్రమంబుననేయున్నయెడల మాబోఁటిమునులకు భయపడి యట్లొనర్చుటకు వెనుదీయును గావున నట్లొనర్చితిని.

హిర—బాగు. నారదా! నీవు దేవతాపక్షపాతివై నను మాకు బంధుకోటిలోనివాఁడవగుటచే నాకు వందనీయుఁడవుసుమా? దేవీ! తరువాత తరువాత?

లీలా—మనోనాయకా! నేను నీవిరహానలంబున నుద్భవిల్లెడిదుఃఖంబుచే మడియుదునను భయంబున నిమ్మహానుభావుండు తన జపతపంబులయందైనను నశ్రద్ధవహించి, నావిచారంబు వాపుటకై శ్రవణానందంబులగు ననేకేతిహాసంబులం జెప్పుచుండెడిని. ఇట్లు కొలఁదికాలంబు గడచినపిమ్మట నొక శుభదినంబున నీబిడ్డండు జన్మించె. బాలకునిం జూచి సమస్తవిచారంబులం బాసి నిశ్చిం

తత్తో గాలము హాయిగా వెళ్ళఁబుచ్చితి. తరువాత నీవువచ్చిన యుదంతం బెఱిఁగి నన్నుఁ దోడ్కొనివచ్చె.

హిర—దేవి! ఇఁక విచారింపకుము. నేను తపంబునకరిగి వాణీనాథుని మెప్పించి వానివలన—

లీలా—నాథా ! తమకు నలుమోముల వేల్పొసంగిన వరంబులన్నియు నారదముని నాకెఱింగించె.

హిర—అట్లనా? ఆవరంబుల సహాయ్యంబునను, నాభుజబలంబువలనను, నీశత్రుసంతతినంతయుఁ బరిమార్చెద. తరుణీమణీ ! ఇదే నాప్రతిజ్ఞ వినుము.

సీ. నిష్కారణంబుగా నిన్ను బాధించిన
వజ్రపాణిని బట్టి బట్టువాఁడఁ
బట్టి యాతని ప్రియ భార్యచేఁ దప్పక
నీసేవ నొనరింప నిర్ణయింతు
వానికిఁ దోడ్పడ్డ వారలఁ జెఱఁబట్టి
చేయింతు నాసేవ శీఘ్రగతిని
యాపైనఁ గ్రోడమై యనుజునిఁ జంపిన
చక్రపాణినిఁ బట్టి సంహరింప
తే. గీ. విష్ణులోకంబునకుఁ బోయి వేగ వాని
రూపుమాపెదఁ దప్పక యోపడంతి !
యన్నయట్టుల నేఁ జేయకున్న నన్ను
హేమకశిపుఁ డంచును బిల్వకింతి నీవు.

విప్ర—దేవా ! తప్పొనర్చినవాఁడు దండింపంబడక పోవఁడుగదా ? తము రాగ్రహమునుండి విముక్తులుగావలయునని వేఁడుచున్నాను.

హిర—మంత్రీ ! విప్రజిత్తీ! నీమాటనిజము. అలుకయొందులకు? అద్దురాత్ముని దండించుటకుఁగాను మనము రేపుదయమే తప్పక

బయనముగావలయును అంనులకుఁదగిన ప్రయాణసన్నాహము జేయుము. నీవు నావెంటవచ్చుటకు సంసిద్ధుఁడవై యుండుము. శంబరకుమారుఁ డియ్యెడనే రాజ్యపాలనం బొనరించుచుండ వలయును.

విప్ర—దేవర యాజ్ఞాప్రకారంబు నల్పెదము.

నార—దానవనాయకా! యుష్మదాజ్ఞయను భద్రంబుగా నీకొసంగితిని. నాపైనున్న బరువు తగ్గె కాఁబట్టి నాకనుజ్ఞ నొసంగెదవేని నే వెడలెద.

లీలా—నాథా! నాది యొక చిన్ని విజ్ఞాపన.

హిర—ఆవిజ్ఞాపనమును వినఁ గుతూహలుఁడనై యున్నాను.

లీలా—నాథా! మనకు మహోపకారంబొనరించిన నిమ్మౌనిసమక్షంబుననే మన యీవంశోద్ధారకునకు నామకరణమహోత్సవంబు నెరపుట సముచితంబని యూహించెద.

హిర—దేవీ! చక్కని యాలోచనముం జెప్పితివి. మునీంద్రా! వీఁడు ప్రహ్లాదుఁడనే కుమారునకు నామకరణం బుంచెద. వాని నాశీర్వదించి పోండు. (అని యాలోచించి)

తే. గీ. అతులమౌ దుఃఖశోకాబ్ధి నణఁగియున్న
నాకుఁ బ్రహ్లాదమున్ గూర్చె నాఁడుఁ గాన
నేఁటినుండియు వీనిని నిఖిలజనులు
బేర్మిఁ బ్రహ్లాదుఁ డనుపేరఁ బిలువవలయు.

నార—దానవనాయకా! సంతసించితిని. ప్రహ్లాదా! దీర్ఘాయుష్మంతుఁడవై ఘనయశోవిఖ్యాతిం బడయుము. రాక్షసనాయకా! నాకు సెలవొసంగుము.

లీలా—మునిచంద్రా! నమస్కారము.

నార—కల్యాణసిద్ధిరస్తు.

హిర—మునివర్యా! పోయిరండు. (నారదుఁడు నిష్క్రమించును.)
లీలా—మనోహరా! కోపింపకుందురేని వెండియు నాదియొక చిన్నకోరిక.
హిర—మనోహారిణీ! నీకోరికలఁదీర్చుటకు సంసిద్ధుఁడై నీవల్లభుం డుండ నడుగుటకు సంశయంబేల? మత్ప్రాణసమానురాలవగు నీవు కోరినఁ గోపించెదనా? నీకోర్కి వినిపింపుము.
లీలా—ప్రాణేశ్వరా! మీయెడఁ గలచనవు పెంపునఁ గోరుదమని యాస జనియించుచున్నను, నాకోర్కి విని యాగ్రహాయత్త చిత్తులయ్యెదరేమో యని భయంపడుచున్నాను.
హిర—(తలపంకించుచు నిదానించిచూచి) తరుణీమణీ! ఒకానొకవేళ నీవనినయట్లు నాకాగ్రహంబు జనియించెడికోర్కియే యైనచో కోరకుండుటయే యుత్తమంబని తలంచెద.
లీలా—(ముకుళితవదనయై కాన్పించును.)
హిర—(లీలావతీమస్తకముపైఁ జేయువైచి మెల్లఁగా నొత్తుచు)

తే. గీ. జలధరచ్ఛన్నపూర్ణిమా చంద్రునట్లు
నిష్ఫలీకృతవాంఛావి నీతవేద
నాంచితంబయి, కళఁ దక్కి నట్టి నీదు
వదనమును జూడఁగలుగదే వంత నాకు.

కావున నీకోర్కి యెద్దియైననుం దీర్చెద. కోరుము.
లీలా—(ప్రసన్నవదనయయి) మనోహరా! వేఱొండెద్దియు లేదు. మీరు మీశత్రుభంజన మొనరింపవచ్చును గాని శచీదేవిని మాత్రము బాధింపకుందురుగాక యని ప్రార్థింపుచున్నదానను. ఆమెనిటకుఁ దోడ్తొని రాకుందురుగాకయని కోరుచున్నదానను.
హిర—(నవ్వుచు) అట్లనేకావించెద. మంత్రీ! విప్రజిత్తీ! నేఁ జెప్పిన యటుల రేపకడ ప్రయాణమునకై సంసిద్ధంబుగా నుండుము. నీ విఁకఁ బొమ్ము.

విప్ర—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

హిర—దేవీ! మనముగూడ లోనికిం బోయి నాతల్లి కీబిడ్డంజూపుదము రమ్ము. కుమారా! శంబరా! పోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

తే. గీ. ధరణి నేలేశ్వరపు వంశ పరయశుఁడయి
చెలఁగు సుబ్రహ్మణ్యుని ప్రియ శిష్యుఁడైన
యలఘుసుకవి సోమేశ్వరా హ్వాయునిచేత
వ్రాయఁబడె నిది భూమిపై వరలుగాత.





శ్రీ

# ప్రహ్లాద.



తృతీయాంకము—ప్రథమరంగము.



స్థలము—స్వర్గము.

[మహేంద్రుఁడు, బృహస్పతి, యుచితాసనములపైఁ
బ్రవేశించుచున్నారు.]

ఇంద్రు—ఆచార్యోత్తమా !

శా. వైకుంఠంబున కేగి చిత్రరథుఁ డా వైకుంఠునిన్ జూచి, నా
యాకష్టంబులు విన్నవింప విని యా హృద్యత్కృపాళుఁడు, మ
చ్ఛోకాగ్నిం దగనార్ప నియ్యెడకు రాఁగ సొత్తెంచునో లేక దా
రాకన్నానును, నేమితోఁచ దకటా ! ప్రాప్తంబ దెట్లున్నదో?

బృహ—మహేంద్రా ! ఊరక తత్తరపడిన నేమిప్రయోజనము. వైకుం
ఠంబునకరిగి, వైకుంఠు సందర్శించి, యాతని సమక్షంబున దేవ
దానవుల వైరకారణంబును, దివౌకసుల యార్తియు, దానవుల
దౌర్జన్యమును, యుష్మత్సందేశంబును, సమగ్రముగా
విన్నవించి యాతఁ డనుగ్రహించిన వరంబులన్నింని, రావల
యును గదా? నీవింత తత్తరమంద నేల? దయామయుండగు

నయ్యనంతుఁడు భక్తజనసులభుఁడు గాన యాత్రివిష్టపమును గావకపోఁడు.

ఇంద్రు—గురూత్తమా ! అనన్యసామాన్యదుర్లభంబగు నయ్యనంతుని కృపారశ్మి మనపైఁ బ్రసరించునో లేదో గదా? ఆకూ్రరరాక్షసుండే వేళవచ్చునో? యేమేమిబాధలం బెట్టునో? యను భయంబునను,నా సందేశమాలించి రమారమనోహరుం డేమి యనుగ్రహించెనో వినుటకై యుత్సాహంబును నామనంబునం దాండవ మాడుచున్నయవి. ఆకూ్రరరాక్షసుండు రాకమున్నె యావిష్ణు సందేశము న్వినుటకెంతయు నామనంబు తత్తరపడుచున్నయది.

బృహ—మహేంద్రా ! తొలుత నేఁ జెప్పలేదా? మృగరాజున కలుకఁ బుట్టించి,వడివడి ప్రాణంబుల నక్కిఁంచుకొననెంచి మృగశాబక మెంతపరుగిడినను దానిబారిఁబడక ప్రాణంబులన్దక్కిఁంచుకొనఁజాలునే? ఆఁకొన్నసింగంబున కాయరణ్యంబున నాహారంబునకనువగు మృగంబులేమియుందొరకక క్రోధంబునగుహాలోఁ బన్నుండియున్నదానికడకేగి పరిహసించిన లేఁడిగతి యేమగును? దాని నెవ్వరు రక్షింపంజాలెదరు ? పరిహసించినదానికిం దగిన ప్రతిఫల మందవలయునేగాని మఱియొందుమార్గమేమియుఁగాన రాదుగదా? దిక్పాలకులందఱు నీపక్షమూనియుంటచే నావాక్యంబులఁ బాటించితివి కావు. ఏయంశంబునను నావాక్యంబున కెదురాడ మనంబున నిష్టములేని నీపీయంశంబునఁ జెడ్డత్రోవఁ ద్రొక్కితివి. స్వయంకృతాపరాధఫలం బనుభవింపక తీరదు గదా ?

ఇంద్రు—మహాత్మా! ఈవఱకే విచారసాగరంబున మునిఁగి దరిఁగానక బరితపించుచున్న నన్ను మఱింత దుఃఖాబ్ధిలో ముంచుట భావ్యమా ?

తే. గీ. మూఁడులోకంబులనుగూడ ముదముతోడ
నేలుచుండెడివాఁడ నే నిప్పు డొక్క
బక్కరక్కసుఁ జూచి నా ప్రాణములను
పిడికిటనుబెట్టి దాఁచికో వలసివచ్చె.

బృహ—మహేంద్రా! బక్కరక్కసుం డననేల? ముల్లోకంబు లల్లలాడించెడి పరాక్రమసంపదఁ గలిగియుండెనే? పరాక్రమంబు నకుం దోడు పద్మభవునిమెప్పించి మున్నెవ్వరుబొందియుండని మహావరంబులంగూడఁ బొందెయుండునని నారదునివలన వినియుంటిమే? అట్టివానింగూర్చి వెఱచుట యొకవింత కాదు.

యము—(ప్రవేశించి తనలో) ఆహాహా! కాలమహిమ.

సీ. సమవర్తి యనుపేరు సమసిపోయెను నేఁడు
పలలాసికోద్రేక వహ్నిచేత
యామ్యదిశాధీశుఁ డను నామ మడుగంటె
పలలాసికోద్రేక వహ్నిచేత
దిక్పాలబిరుదంబు దీరిపోయెను నేఁడు
పలలాసికోద్రేక వహ్నిచేత
వాఁడిపాశంబు నాశంబు జెందెఁగా
పలలాసికోద్రేక వహ్నిచేత

తే. గీ. జోలిమాలినపనికి నే నేలపోతి?
సహీని, దరిఁజేరి చెలగాట లాడునట్టి
వారిపదములు గఱచియే దీరుగాని
మఱలఁ జెలగాటలాడునే మహిని నరయ.

(ప్రకాశముగా) మహేంద్రా! పురుషోచితంబయిన శౌర్యధైర్యంబులు దుష్టచరితుండగు హిరణ్యకశిపున కర్పించి, పిఱికిపందవై పరుగిడివచ్చిన యంతకుం డిదేయభివందన మాచరించుచున్నాఁడు

ఇంద్రు—యామ్యదిశాధీశా !—

యము—నముచిసూదనా! యామ్యదిశాధీశుం డనుబిరుదంబు హేమకశిపున కర్పించితి. ఇఁక నన్నా పేరునం బిల్వకుము.

ఇంద్రు—కృతాంతా! హిరణ్యకశిపుఁడు నిన్నునుఁ బరిభవించెనా ?

యము—దేవా! ఏమిచెప్పుదును. రాత్రించరుం డరుదెంచి యోరోరి సమవర్తీ! మత్సహోదరుండగు హిరణ్యాక్షుం డెట్టిపాపంబు లొనరించెనురా? ఏదీ! చూచెద. నీవెందయిన లిఖించితివేమో యాతం డొనర్చిన పాపంబు లెవ్వియో నాకుఁజూపుము. ఔరా! నన్నైనం జూడక నేలేనియదనుం గనిపెట్టి మదీయపురప్రవేశ మొనర్చి పాశంబులచే మద్భటాళిప్రాణంబు లపహరించితివఁట. నీవెంతగుండెలుదీసినబంటువురా! ఇంకెందుఁ బోయెదవురా? యని పండ్లు పటపటంగొఱుకుచు నా కేశంబులొడిసిపట్టి, నన్ను మాంతముగా క్రిందికిలాగి,ఓరోరిదుర్మదా!పిసాళీ! మొక్కలీ! ప్రతీక్షిప్తం బెట్టిదియో యెఱుంగని నీ వీదిక్పాలపదవి కనర్హుఁడవు. ఇంతకాలము నీవత్యంతశ్రమతో నుద్యోగంబుఁ గైకొని న్యాయాన్యాయవివక్షత లేకుండఁ బరిపాలనం బొనరించినందుల కీచతుర్థార్థచంద్రప్రయోగంబులును హిరణ్యకశిపుం డిచ్చిన కాన్కగా గ్రహించిపొమ్మని నన్నతిక్రూరత్వంబున నఖక్షతంబుం గావించె.

ద్వార—(ప్రవేశించి) దేవా! జయము. చిత్రరథుం డరుదెంచినాఁడు.

ఇంద్రు—సంతోషము. సంతోషము. శీఘ్రప్రవేశ మొనర్పుము.

ద్వార—చిత్తము. (అని నిష్క్రమించును)

[ప్రవేశము: చిత్రరథుఁడు]

ఇంద్రు—(చిత్రరథునిజూచి) చిత్రరథా!

చ. కనఁబడినాఁడె నీకచట ? కంజదళేక్షణుఁ డైన విష్ణు? వా
తనికడ మాదుకష్టములు ? దైన్యగతి న్వచియించెనావె? యా

మనుపరిబోధితునంచుఁ దగ ౯ మన్ననఁజేసెన ప్రేమఁ గోడ? నే
వినుటకు సంతసంబొదవె ౯ వే వచియింపుమి యత్నంబులోన్.

యము—(ఆతురతతో) ఈ వారిసందేశం బాలించి యా వైకుంఠేశుం డభయంబిచ్చెనా? లేదా ?

చిత్ర—దేవా! మీచే ననుజ్ఞాతుండనయి వైకుంఠంబున కరిగి భక్తజనసులభుండగు నప్పద్మనాభుని దర్శించితి. మీ వార్తావహుండనని యెఱింగినవాఁడై నన్నతిగౌరవంబునం గూర్చుండఁబెట్టి దిక్పాలకుల క్షేమంబడిగె. అంత నేను రాక్షసపరాభవంబునకు సిద్ధంబుగానున్న మీ సేమంబును, మీ రా దామోదరునికిం జెప్పుమని నుడివినవాక్యంబులును యాతని కెఱింగింపఁ "చిత్రరథా! హిరణ్యాక్షశిపునకింకను గాలంబు దారసిల్లియుండలేదు. వాఁడు చతురాననునివలనఁ బెక్కువరంబులం బొందియున్నాఁడు. కావున నే వానిమరణసూచనకై వానిగర్భంబున మద్భక్తాగ్రేసరుండగు బాలుండు జన్మించియున్నవాఁడు. అచిరకాలంబుననే వాని యాయుఃపరిమాణం బంతంబయ్యెడిని. అంతవఱకు శాంతి వహించి దైత్యునిబాధల కోర్చి యెట్లో కాలంబుగడుపుమనుము. నీవికఁబొమ్ము" అనియె. ఇవియే పద్మనాభునివాగార్భటీశీకరంబులు.

ఇంద్రు—ఆహా! ఎంతకష్టమెంతకష్టము ఈ క్రూరరాక్షసుండపారమగు బాధలం బెట్టుచుండ మేమెట్లు సైరింపఁగలము. హా! మాధవా! ఇంకెంతకాల మీ రాక్షసుని బాధల భరియింపవలయును. సరి నేమి. చిత్రరథా! నీవికఁ బొమ్ము.

చిత్ర—చిత్తము. (అని నిష్క్రమించి మఱలఁ బ్రవేశించి) దేవా!

సీ. నిడుదలౌ నెఱ్ఱని ౯ వెడదకన్నులనుండి
విస్ఫులింగంబులు ౯ వెడలుచుండ

జృంభించి మిక్కిలి జేవ్రతించిన మేన
స్వేదకణంబులు జిమ్ముచుండ
చిమ్మచీకటితోడఁ జెలిమియొనర్చెడి
నిటలంబునందు భ్రూకుటి నటింపఁ
బలుమాఱుఁ దనపండ్లు బటపటఁ గొఱుకఁగాఁ
దొట్టనా తెఱనెత్తు రుట్టిపడఁగ
తే. గీ. వసుధనిలువక వడివడిఁ బరుగులిడుచు
హుమ్మనుధ్వని యొనర్చుచు హుంకరించి
భూనభోంతర చక్రముల్ భోరుకలఁగ
నార్చి యటువచ్చుచుండె నా యసురుఁ డెవఁడొ?

ఇంద్రుఁడు—ఆచార్యోత్తమా! కర్తవ్యము. కర్తవ్యము.

బృహ—మహేంద్రా! కర్తవ్యమున కేమున్నది. మన కెన్నఁడుం బరాభవంబు తప్పదు. హిరణ్యకశిపు ప్రతిజ్ఞావాక్యంబులన్నియు నారదుండు మనల కెఱిఁగించెఁగదా? కాఁబట్టి పౌలోమి తన సుతుసందోహముతో మేరుపర్వతసమీపంబున నుండుట మంచిది. కావున చిత్రరథు చేత నే జయంతుని దల్లిని బౌలోమిని వార్తఁ బంపి మన మావాసపురి వాస్తవ్యంబులకన్నిటికిని దలనూఁచుట యే కర్తవ్యము.

ఇంద్రు—(విచారముతో) చిత్రరథా! నీవరిగి శచీజయంతులతో జరిగిన వృత్తాంతంబంతయు సమగ్రంబుగా వినిపించి, కష్టకాలంబు గడచువఱకు, వైకుంఠేశునకు మనయెడ ననుగ్రహంబుగల్గువఱకు, దుష్టరాక్షసుండగు హిరణ్యకశిపుం డంతరించెనని వీనులార వినంబడువఱకు, మేరుపర్వతప్రాంతంబుల మెలఁగవలయు ననుము. కష్టంబు లిల్లుగట్టుకొని కాఁపురం బుండవనుము. మఱియు,

సీ. ఆలుబిడ్డల పొట్ట / కన్నంబు దేలేని
పాకశాసనుఁ డిట్లు / బల్కె ననుము
వెలఁదిరో ! స్వర్గంబు / విధిలేక చేఁజేతఁ
బాలసుఁదిండికి ధార / పోసితనుము
తలదాఁచుకోదగు / స్థలమెన్న మేరుప
ర్వతభూమి మనకు ని / వాస మనుము
రాక్షసాధముఁ డిందు / రాకుండ వేగమే
నమృతభాండంబుతో / నరుగుమనుము
తే. గీ. పంచవర్షంబు లచ్చట / బ్రతుకవలయుఁ
బిదప మనకెందు సౌఖ్యంబు / లొదవుననుము
చెప్పవలసినసంగతుల్ / జెప్పినాఁడఁ
జిత్రరథ ! పొమ్ము దాల్మినిఁ / జెలియ కడకు.

చిత్ర—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

[తెరలో]

ఓ! సురసిద్ధసాధ్యవిద్యాధరకిన్నరకింపురుషులరగు నోయోధవరులారా!

క. శతమన్యుండఁట, ధర్మ
స్థితి నెఱింగినవాఁడఁట, నల / త్రిభువనములకున్
బతియఁట, తెల్పుఁడి లీలా
వతీమనోహరుఁడు జూడ / వచ్చెనట చున్.

యము—అయ్యయ్యో ! ఆకంఠరవ మాహిరణ్యకశిపునిదే. అక్కటా!
వచ్చుచుండెనే ?

[ప్రవేశము: హిరణ్యకశిపుఁడు]

బాండుట్యూన్—ఆదితాళము.

హిర—బంచెదన్ య - డంచెదన్ నినుఁ - ద్రుంచెదన్
యించుక నతి-యుంచను, మది-నెంచక నల-యించిన నిను! నుం!

దనుజులబలమెల్లన్ - గనుఁగొనబలమున్నన్
తనివిదీరఁ - గనఁగనీకు - ధైర్యమున్న వేగరార॥ నెంచె॥

(అని యింద్రుని సింహాసనముపైనుండి క్రిందకులాగి బృహస్పతివైపు దిరిగి) ఓ! దేవగురూ! బృహస్పతీ! తారామనోహరా! వడుదు దనపుగర్వంబునఁ గన్నును మిన్నునుంగానక దురాచారుఁడై వర్తించుచుండిన మహేంద్రుని నీవైన మందలింపవలదా! నల్ల గడ్డము తెల్లఁబడినయట్లే నీబుద్ధియుం దెల్లఁబడియెనా? ముది మిచే మతిచెడియున్న నీ వెట్లీమహేంద్రునకు హితోపదేశ మొనర్ప సమర్థుండవగుదువు? (అని యిటునటుఁజూచి యాశ్చర్య ముతో) ఎవరు వీరు? దిక్పాలకులా! ఏల యిట్లరుదెంచితిరి? మ రల నులూకునితోఁగూడి నాపట్టణంబు ముట్టడించెదరా యేమి?

బృహ—(వడంకుచు) దానవనాయకా!—త—మ—

హిర—కండ్లుగానవా! దేవతల పీచమడంచితినని యెఱింగియు నన్నేల దేవదానవనాయకా! యని పిలువవు? ఏదీ యట్లు పిలువుము.

బృహ—దేవదానవనాయకా! తమరీసింహాసనంబుపై నధిష్టింపుఁడు.

[ప్రవేశము: విరూపాక్షుఁడు]

హిర—(చూచి) విరూపాక్షా! ఈదేవతలు కాళ్ళబేరంబునకువచ్చిరి. కాన నీయింద్రుని, వీనికి సహాయ్యంబునకువచ్చిన యీ యప్ర యోజకులైన దిక్పాలురనుగూడఁ దోడ్కొని మత్పురీవరంబున కరిగి యట బందిగములో నుంచుము. నేను తిరిగి పురప్రవేశ మొనర్చినవెనుక వీరల కుద్యోగంబులం గల్పించెద. మఱియు నోవిరూపాక్షా! నేను వైకుంఠంబునకుఁ బోవలయును. విప్ర చిత్తితో నన్నుఁ గలసికొమ్మని నావాక్యములుగాఁ జెప్పుము.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

విరూ—అయ్యా! నడువుఁడు. (అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

### స్థలకము—వైకుంఠము.

[ప్రవేశము: హిరణ్యకశిపుఁడు, విప్రజిత్తియు ఖడ్గధారులై]

హిర—విప్రజిత్తీ ! అష్టదిక్పాలకులన యనన్యసామాన్యదుర్లభు లను కొంటిని. వారు వట్టిపిఱికివారు సుమా ? ఔరా ! ఆవిధాత యెంతమూర్ఖుఁడు. దిక్పరిపాలకుల నిట్లసమర్థుల నిర్ణయింపఁ దగునా? ఏమీ వాని మౌర్ఖ్యము. ఏమయిననేమి ? మనపని సఫలీకృతమయ్యెను గదా? ఇఁక నాయనుజుని యంతంబునకు మూలకారకుఁడైన యాహరిమద మడంపవలయును. ప్రెగ్గడా!

శా. నాతో నగ్ని కుబేర మారుతవరుల్ । నాకేశుఁడుఁ మద్దదా
ఘాతానూనదవానలంబునకు స్ని । గ్ధప్రాణులైయుంటఁ జే
సేతన్ సర్వము ధారపోసిరి కదుఁ । జింతింప నావిష్ణువే
యీత్రైలోక్యములందు శత్రుప్రుగదా? । యేరీతిఁ జెండాడెదన్.

కానిమ్ము. విష్ణులోక మిదియేగదా ? నే లోనకుం జని వానింబట్టి తెచ్చెద. నీ విందేయుండుము. (అని లోనకుం జని రెండవ వైపునుండి ప్రవేశించి) ఓరోరి కులాంతకా! నీ వేమూల పిఱికి పందవై యడంగితివిరా జడమతీ ! నీకుం బ్రబలవిరోధియగు హిరణ్యకశిపుం డిదే నిన్నుఁజూడ—కాదు. కాదు. నిన్నుమడి యింప వచ్చియున్నాఁడు. శక్తిగలదేని వచ్చి నాయెదుట నిలు వుమురా! ఓరోరి పిఱికిపందా! పూర్వము—

ఆ. వె. నట్టగిడసవయ్యు । మడియించినావఁట
మామకీనవంశ । సోమకు నొగి

నన్నుఁ జంప నీవు నక్కయో, కుక్కయో
యిష్టమైన రూప మెత్తి రార !
(తెరమీఁద మత్స్యావతారము గాన్పించును.)

ఓహోహో! నన్నును నీ చేఁపరూపంబుచేత నే మడియింపవచ్చితివా? రమ్ము. రమ్ము. నీతుళ్ళడఁగించెద. (అని దరిఁజేరి పట్టుకొనఁ బోవ నదృశ్యమగును.) ఏమీ! నీ కీరూపంబుచే స్వాధీనంబు గానని పరుగిడితివా? మఱల నేరూపంబు దాల్చెదవో దాల్చి రమ్ము. రమ్ము. హిరణ్యకశిపుండన నీకు సాధ్యుండనుకొంటి వేమో? కాఁడు. కాఁడు. మున్ముమ్మాటికిని గాఁడు.

(తెరమీఁదఁ గూర్మావతారంబు గాన్పించును.)

విప్ర—దేవా! మరల నామేటి తాఁబేటిరూపంబు దాల్చి వచ్చి యున్నాఁడు.

హిర—రానిమ్ము. రానిమ్ము. ఓరోరి మాయావీ!

తే గీ. తుచ్ఛరూపంబులను దాల్చి దుష్టబుద్ధి
శత్రునాశన మొనరింప సాహసమొకో?
కులము, బలమును, మానంబు, గలిగెనేని?
చేతఁజేయిచ్చి పోరరా చెనఁటి నీవు.

(అని వడివడిఁ జని పట్టుకొనఁబోవ నంతర్ధానమగును.)

ఏమీ! యీవింత? వీని నిరంతరమైన నివాస మెఱుఁగరాకున్నదే! వీని నెక్కరణిని మడియింతును?

[ఆలోచించుచుండఁగా వరహావతారంబు గాన్పించును.]

ఓరోరి! తుచ్ఛా! వాయనుఁజుని మడియింపందాల్చిన పందిరూప మిదియేనా? ఒక్కనిమేషం బట్లనే యుండుము. పరలోకంబున నాతమ్మునిఁ గలసికొనుటకు—కాదు. కాదు. శరణు వేఁడు కొనుటకై పంపించెద. కాచికొమ్ము.

మత్తకోకిల.

పందిరూపము దాల్చి తమ్ముని ♦ భస్మమొనర్చఁ జేసి ని
ద్రెందఁదతన్ పరిపంథి! నిన్నుఁక ♦ దద్దఁ జంపఁగనెంచి నే
నిందువచ్చితి నోమృగాధమ! ♦ యొందుఁబోయెద వింక నిక్
మ్రిందఁజేయుదు కాచికొమ్మిఁక ♦ రాగశూన్య విమోహకా!

(అని కోపముతో నడచుచుండ వరహావతార మంతర్ధానమగును.)

(కోపముతో) విప్రజిత్తి! నాకు భయంపడి యానిలుకడలేని గిగ్గాణి పలాయనంబయ్యె. ఇట్టి పిటికిపందను, మాయకానిని, తుచ్ఛుని జడమతిని, సంహరింపఁజూచుట నాపౌరుషంబునకే కొఱఁత యయ్యె. నారాక స్వని పరుగిడిన యీ మహాబలశాలి మన కపకార మొనర్పఁజాలఁడుఁ కాన బోదమురమ్ము. (ఆలోచించి) పెగ్గడా! చండామార్కులవద్ద విద్యాభ్యాసము సల్పుచుండిన నాతనయుండగు ప్రహ్లాదుని జూచుటకై నామనము తత్తరపడు చున్నయది కాన యాలసింపక రమ్ము. పోదము.

విప్ర—చిత్తము. (అని యిర్వురును నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

తే. గీ. ధరణి మేడపాడ్వస్త్రాము ♦ వరయశుఁడగు
కీర్తిఁగాంచిన నరశింహ ♦ మూర్తి యల్లుఁ
డైన సుకవి సోమేశ్వరా ♦ హ్వాయునిచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.





శ్రీ

# ప్రహ్లాద

తురీయాంకము—ప్రథమరంగము.

స్థలకము—హిరణ్యకశిపుని సభ.

[హిరణ్యకశిపుఁడు, లీలావతి, విప్రజిత్తియుఁ బ్రవేశించుచున్నారు.]

హిర—మనోనాయకీ !

కం. ఋణ, రణ, వ్రణ, శేషంబులు
మనుజునకుఁ దగవటం చుర్వీ మాన్యులు నిలఁ గా
వున నే నాశత్రువులను
ననుకంప యొకింత లేక నడఁచితిని చెలీ !

పురంధ్రీరత్నమా ! దుర్మదాంధులై మన కపకృతి సల్పిన యాదిక్పాలుర నడంచితి. అన్యాయంబుగా నాయనుజుని యసువులందీసిన యమ్మాయకాఁడు నాకు భయంపడి పరుగిడె అట్టివాఁడు నన్నేమిచేయఁగలఁడు! (మంత్రివైపుఁ దిరిగి) మంత్రీ!

విప్ర—దేవా! ఏమియాజ్ఞ ?

హిర—అష్టదిక్పాలకుల నడంచితి నాచేఁ బరాభవంబునకుఁ బాల్పడ వలసివచ్చు ననుభయంబున నేమూలనో డాఁగిన యావిష్ణువు నాకన్నఁ దక్కువవాఁడే? కాఁబట్టి యిటు వినుము. సృజించుట

కొక్కరుండును. లయకారకుఁ డింకొక్కరుండును, యింక నే
వేవియో నుద్యోగంబులం గల్పించుకొని పెక్కండ్రీధరామండ
లంబు పాలించుచుండుటచేత నే యిట్టి యన్యాయంబు లుద్భ
విల్లుచున్నయవి. నాభుజపరాక్రమంబున వీరి నందఱిని నిగ్ర
హించి తదుద్యోగం బేను గైకొంటి. కావున ముల్లోకంబులం
గల ప్రజలెల్లరు నన్నే భగవంతునిగా నెంచునట్లు, నన్నే
పూజించునట్లు జాటంబంపుము. మునులెల్లరును నన్నుఁగూర్చియే
తపం బాచరింపవలయును. ప్రత్యక్షంబయిన నేనే ప్రత్యక్షంబై
తగినవరంబు లొసంగెదను. ఒకానొకవేళ నేమూర్ఖులైనను
నన్నుఁ గొల్వకున్నయెడ వారింబట్టి దండించెదమనియుంగూడఁ
జాటింపఁబంపుము. నేఁడే యొకజంఘాలకుం డగుచాంఘికుని
నియమించుము. ఇటు వినుము.

సీ. జననవృద్ధిలయాభి ♦ సంరంభరశ్మిచేఁ
ద్రిగుణాత్మకుం డౌచు ♦ దివిరినాఁడు
యామ్యదిశాధీశు ♦ నడుగంట దిగఁద్రొక్కి
బనివడి యముఁ డౌచుఁ ♦ బరఁగినాఁడు
ప్రాగ్దిశాధీశుని ♦ బదహీనుఁగాఁ జేసి
స్వర్గాధిపతి యౌచు ♦ వరలినాఁడు
సుమనఃకలాపంబు ♦ స్రుక్కింపఁగాఁ జేసి
సుమనఃకలాపుఁ డై ♦ యమరినాఁడు

తే. గీ. యట్టివానికి నెదురేది ♦ యవనిలోనఁ
గాన నా హేమకశిపుని ♦ మానసమున
దేవదేవుఁ డటంచును ♦ దివిరి మీరు
నమ్మి భజియింపవలెఁజుండి ♦ నెమ్మనమున.

అని చాటంబంపుము. మంత్రి నీవింకఁ బొమ్ము.

విప్ర—దేవా! చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

హిర—చెలీ !

కం. తనయుల సంభాషణములు
వినుచుండిన మదికి మిగుల వేడ్క జనించున్
జననీజనకుల కిలఁ, గా
వున పిలిపింపవలయు మన పుత్రకు నిటకున్.

(అని ద్వారమువైపుఁ దిరిగి) ఓరీ! ఎవఁడురా ద్వారమువద్ద.

దుర్ము—(ప్రవేశించి) దేవా! ఏమియాజ్ఞ ?

హిర—ఓరీ! దుర్ముఖుఁడా ! మా యాజ్ఞయని తెల్పి చండామార్కుల వారి సాన్నిధ్యంబున విద్య నభ్యసించుచుండిన చిరంజీవియగు మనప్రహ్లాదుని దోడ్కొనిరమ్మని చండామార్కులవారితోఁ జెప్పుము.

దుర్ము—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

హిర—సుదతీమణీ !

చ. పితలకు ముక్తినింప, కుల వృద్ధికిఁ గాంతిలుచందమామ, సం
తతఘనదుఃఖవారినిధి తారణపుంజతరాభినావ, శా
శ్వతబహువృద్ధహస్తగత భాసురమై తగు నూతికఱ్ఱగా
సుతుఁ డని చెప్పవచ్చుఁగద సుందరి ! సందియమందకుండఁగాన్.

లీలా—నాయకా ! సత్యము. సత్యము. (తెరవైపుఁజూచి) అల్లదే కుమారుండు గురువర్యునితోఁ బ్రవేశించుచున్నాడు.

[ప్రవేశము: ప్రహ్లాదుఁడు, చండామార్కులు ]

ప్రహ్లా—జననీ జనకులారా ! నమస్కారము.

హిర—దీర్ఘాయుష్యమస్తు.

లీలా—తండ్రీ ! చిరంజీవివై వర్ధిల్లుము. (అని దగ్గరగాఁ దీయును.)

హిర—గురూత్తమా! ఈయాసనం బధిష్ఠింపుఁడు. చిరంజీవి శ్రీద్ధాభక్తులతోఁ జదువుచుండెనా?

చండా—చిత్తము. (కూర్చుండి తనలో) ఓం నమోహిరణ్యాక్షాయ నమః యనుమని చెప్పినప్పుడే "ఓంనమోనారాయణాయనమః" యనిన ప్రహ్లాదుండు తండ్రియెడ నెట్లు ప్రవర్తించునో గదా?

హిర—(ప్రహ్లాదుని దగ్గరగాఁ దీసికొని) కుమారా!

చ. సదయులు, సత్ప్రవర్తకులు ॥ సజ్జనులౌ గురువర్యులెల్ల నీ
కొదవగు సర్వశాస్త్రముల ॥ నొప్పుగ చెప్పఁగ నేర్చుకొంటివే?

ప్ర—జనకా!

సదయులు సత్ప్రవర్తకులు ॥ సజ్జనులౌ గురువర్యులెల్ల నా
కొదవగు సర్వశాస్త్రముల ॥ నొప్పుగ చెప్పఁగ నేర్చికొంటిగా.

హిర—(సంతోషముతో) గురుపుత్రా! మత్కుమారుని సకలశాస్త్రపారంగతునిగాఁ జేసితిరి. సంతసించితి. (ప్రహ్లాదునితో) నాయనా! నీ కుపయుక్తంబగు సర్వశాస్త్రములుంగూడ కరతలామలకంబయ్యె ననికదా చెప్పితివి. అట్లయిన నాప్రశ్న కుత్తరంబీయుమీ?

ప్ర—జనకా! చిత్తము.

హిర—కుమారా! నీవు పఠించిన సర్వశాస్త్రంబులయొక్క సారం బెట్టిదియో తెలిసికొంటివేని వినిపింపుము.

లీలా—మనోహరా! పంచవర్షంబుల బాలకు నిట్లు ప్రశ్నింపవచ్చునా? మహామహోపాధ్యాయులైన నిట్టిప్రశ్నకు సదుత్తరంబిడ సంశయింతురే? అట్టియెడ నిట్టి చిఱుపాపఁ డుత్తరం బీయఁగల్గునా?

ప్ర—జననీజనకులారా! యిటు వినుండు.

క. సారం బేమని యనుచును
వేరుగ నడుగంగనేల? ॥ విను డెల్పెద, ని

స్సారము సంసారము శ్రీ
స్వామినిదిని గొల్చు లోకులకె సారము జనకా !

హిర—(తనలో) ఏమిది ? వీని కీవిరోధమార్గం బెవ్వ రుపదేశించియుం దురు ? (ఆలోచించి) భార్గవకులదీపకులగు చండామార్కు లిట్టికుమార్గం బుపదేశించియుందురా ? ఏమియుఁ దెలియని చిఱుపాపఁడొటచే నిట్లనియుండునా ? (ప్రకాశముగా) కుమారా ! నీవు నుడివిన విష్ణువు మన కులంబునకుఁ ప్రబల విరోధి. నీపినతండ్రిని జంపినాడు. అట్టివానిని మనము గొల్వరాదు. నాయనా ! నామాట వినుము.

ప్ర—జనకా ! ఏమంటిరి ? ఆదిమధ్యాంతరహితుండగు నమ్మహాను భావునకు విరోధులనియు, విహితులనియు లేరు. అందఱు సమానంబులే. దుష్టశిక్షణయు, శిష్టరక్షణయు, యాతని కర్త వ్యంబులు. ఎవ్వాని నేరీతి నృడియింపవలెనో యాయారూపం బులం దాల్చి దుష్టులను మడియించుచుండును.

హిర—అట్లనా ? (తలపంకించుచు) దుష్టు లనువారెవ్వరు ?

ప్ర—తండ్రీ ! ప్రపంచంబున కపకారంబు సల్పెడివారలందఱును దుష్టులే.

హిర—కుమారా ! నావాక్యంబు లాలించుము. పిఱికిపందయగు నమ్మాయాకారుని భగవంతుఁడని నమ్మకుము. (కోపముతో చండామార్కులనుద్దేశించి) గురుపుత్రా ! మత్కుమారున కీ విరోధశాస్త్రంబు లెట్లలవడినవి? ఎంచిచూడ నీవె యిట్టిదుర్బోధ కుపక్రమించితివని తలంచెద. లేకున్న వాని కీవిరోధశాస్త్రంబు లెట్లలవడియుండును ? (చండామార్కులు వడంకుదురు.)

ప్ర—జనకా ! నిష్కారణ మామహానుభావుని నిందింపకుము. జగదీశ్వరుండగు నమ్మహావిష్ణువుపై భక్తి యొఱు లుపదేశించి

నంత మాత్రమున నలవడదు. నిజమయిన విష్ణుభక్తుండగుటకుం బూర్వజన్మసుకృతం బుండవలయును. అట్టి పూర్వజన్మసుకృతమే లేనియెడల యెంతమం దెన్నెన్నిమార్గంబుల బోధించినను వ్యర్థమేగాని లాభం బిసుమంతయుం గానరాదు.

హిర——ఛీ! ఛీ! నాకడమాత్రమ మావిష్ణువు "నాదిదేవుఁ డాదిదేవుఁ" డని నుతింపకుము. మూర్ఖుఁడా! విష్ణువు విష్ణువనుచు వాపో యెదవేలరా దుర్మతీ! విష్ణుభక్తి మానెదవా లేదా?

ఉ. మానుర విష్ణుభక్తి

ప్ర—— అది ? మానను

హిర—— మాన నటంచుఁ బల్క నీ

ప్రాణము దీయువాఁడ

ప్ర—— క్షణ ? భంగురమేగద

లీలా—— తండ్రివాక్యముల్

వీనులఁ బెట్టు పుత్ర!

ప్ర—— నను ? వేఁడకు మమ్మరో!

లీలా—— నాథ! కోపముఁ

బూనకుమయ్య!

హిర—— యేమనెను ? పుత్రక!

ప్ర—— వీడఁగఁజాలఁ బూనికన్.

హిర——(క్రోధముతో) గురుపుత్రా! వీనిం దోడ్కొనిపోయి రాజకుమారుండని యాలోచింపక కఠినశిక్షలం బెట్టియయినను వీని నీమార్గంబునుండి త్రిప్పుఁడు. దోడ్కొని పొండు.

చండా——చిత్తము. (ప్రహ్లాదునితో నిష్క్రమించును.)

హిర——ప్రియసఖీ! మనముగూడఁ బోదము రమ్ము. (నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

### స్థలకము—పాఠశాల.

[చండామార్కులు, ప్రహ్లాదుఁడు, నలుగురుపిల్లలు ప్రవేశించుచున్నారు]

చండా—ఒరేయి! మీరల్లరిచేయక పాఠములు చదువుచుండుడు. ఇప్పుడే వచ్చెదను. (అని నిష్క్రమించును.)

1వ. బా—ఒరేయి పంతులుపోయాడురండిరా కోతికొమ్మచ్చి యాడుదాము.

3వ. బా—ఆ యాట వద్దురా—ప్రహ్లాదుఁడేయాటయాడుదామంటే యాయాట యాడుకొందాము.

అందఱు—ఆడుగుదాము. అడుగుదాము.

2వ. బా—ప్రహ్లాదా! మన మేయాటయాడుకొందాము.

ప్ర—సహాధ్యాయులారా! మన మాటలవలనఁ గాలక్షేపము సేయఁజనదు. నేనొక్కయంశం బుపదేశించెద నదివినియెదరా?

అందఱు—ఓ! తప్పకుండా వింటాము. చెప్పుము. చెప్పుము.

ప్ర—మిత్రులారా! సమస్త జన్మంబులయందును మనుష్యజన్మంబు దొరకుట కడుంగడు దుర్లభంబు. అదృష్టవశంబున మనుష్యజన్మంబులభించినను, పురుషుండై జన్మించు టతిదుర్ఘటము. అదియైనను శతవత్సరపాయమే! ఆ శతవత్సరంబులలో నిద్రావ్యవహారంబులు పంచాదశవత్సరంబులు గడచు. బాల్య, యౌవన, వృద్ధ, కౌమారాది విశేషంబులు యిరువదివత్సరంబులు గడచు. మిగిలిన ముప్పది వత్సరంబులును యింద్రియములచేతఁ బట్టువడి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబు లనుపాశంబులం దవిలి వానినుండి తప్పించుకొనలేక సర్వమునాదియని 'నా' యను నక్షరంబుతో జగత్తంతయు

నిండియున్నట్లు తలంచి, పొంగి పర ధన కనక వస్తు వాహన సుందరులం గైకొనం జూచుచు, కాలంబు వ్యర్థంబుగాఁ గడపుటవలన లాభంబు లేదు. ఏదిపోయినను తిరిగిరావచ్చును గాని కాలముమాత్ర మట్లుగాదు. మఱియు, నైజసాహంకారం బువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుగలై. ప్రాణంబునకుఁ గ్రియాశక్తియు, బుద్ధికి జ్ఞానశక్తియు, భగవంతుఁడనుగ్రహించె. అట్టిశక్తి భగవంతుం డనుగ్రహించినందులకు—

చ. తిరముగు నిష్ఠ బూని, కడు దీక్షితులై భువినెల్లకాల మా
హరి మధుసూదనుం విమలు నచ్యుతు సర్వశరణ్యునిందిరా
వరుఁ గరుణాలవాలు భవ బంధవిమోచనుఁ బాపనాశునిం
బరుఁ బరమేశుఁ గేశవుని భక్తిభజింపుచు ముక్తినొందుడీ.

3వ.—ప్రహ్లాదా! కేశవునిఁ గొల్వుమనుచుంటివిగదా? అతఁడెట్టివాఁడు

1వ. బా—ఒడలినిండా వెంట్రుకలున్నవాఁడురా ? హరిలాంటివాఁడు.

ప్ర—హితులారా ! ఇటువినుండు. ఆతఁడు భక్తజనసులభుఁడు. కేశవా యను నామంబున క, ఈశ, వ, యను నక్షరంబు లున్న యవి. అందు 'క' అనగా మనస్సు. సర్వకార్యంబుల కును మనస్సే ప్రధానము. అట్టి మనస్సునకు 'ఈశ' ప్రభువు అనఁగా మనోనిగ్రహము. (అంతరాత్మ) అట్టిమనోనిగ్రహాతగల వారికి 'వ' ప్రాప్యుఁడు. మనోనిగ్రహాత గలవారికి లభించెడి వాఁడు గావుననే క, ఈశ, వ, కేశవా! యను నామం బామహానుభావునకుఁ జెల్లుచున్నయది. మఱియు,

సీ. అఖిలపాపంబుల హరియించువాఁ డౌట
హరి యను నామంబు నతని కలరెఁ
గన స్వరూపంబు నాశనము లేకుంటచే
నచ్యుతుం డను నామ మతని కలరె

నింద్రియంబులకెల్ల నినుఁ డాటచే హృషీ
కేశుఁ డనుచు వానిఁ గీర్తిసేతు
రఖిల భూతంబుల యందుఁ బెన్వాలుఁగుచే
వ్యాపించియుండుటన్ వాసుదేవుఁ
తే. గీ. డరయ భక్తుల దుఃఖమ్ము లడఁగఁ ద్రొక్కి
కరుణఁ బాలించుచుంట సం కర్షణుండు
పురుషులందునఁ గడు నుత్త ముండు గాన
హరియె పురుషోత్తముం డనఁ బరఁగు జగతి.

2వ. బా—ప్రహ్లాదా! సంతత మావిష్ణువునిఁ గొల్చునంతమాత్రమున వానిం దెలిసికొనఁగలుగుదుమా?

ప్ర—ఇటువినుఁడు. ఉపనిషద్వాక్యంబు లాపరమేశ్వరుని స్వరూపంబునే చాటుచున్నయవి. కావున 'గోవిందా' యను వాక్యంబుచే మన మావిష్ణువునిం దెలిసిగొనంగలము. కాఁబట్టి మన మందఱము గోవింద భజనము సేయుదము రండు. (ప్రహ్లాదుఁడు చెప్పఁగా మిగిలినవారు పాడుచు వలయాకారముగాఁ దిరుగుదురు.)

2వ. బా—ప్రహ్లాదా! ఆఁగుమాఁగుము. ఈగోవిందుఁడెచ్చటనుండును?

ప్ర—ఒక స్థానంబన్న నిర్ణయము లేదు. చరాచర సమస్త భూతంబులయందును గూడ నుండును. కావుననే విష్ణువను నామంబునఁ జెలఁగుచుండె. కాఁబట్టి మన మా విష్ణువుని భజింతము రండు. (బాలకు లందఱు గుమిగూడి ప్రహ్లాదుఁడు చెప్పుచుండఁగాఁ బాడుదురు. ముక్తాయింపుతో తన్మయత్వము నొందునట్లుగా భజన సేయుచుండఁగా చండామార్కుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చండా—(నిర్ఘాంతపడి చూచి) కొంప ముంచావురా నాయనా! వీరి నందఱిని నీ మార్గంబునకుఁ ద్రిప్పికొంటివా? (అని బాలకులతో) ఒరేయి. కుఱ్ఱవాళ్లు. మి మ్మందఱిని దన్నవలయునా? హరిభక్తి మాని యిటు వచ్చెదరా? రారా?

(పిల్లలు వినుపించుకొనక భజన చేయుచుందురు.)

(ఒక పిల్లవానిని లాగ వాఁడు విదళించుకొనును. పిల్లలను గొట్టు టభినయించును.)

1వ. బా—ఏమండోయి. ఈ దినము లగాయితు మేము మీ శిష్యులము గాము. మమ్ము కొట్టకండి. బాగా జరుగదు.

బాలు—(గురువుని పరిహసింతురు.)

ప్ర—(హరిభజనముచేఁ దన్మయత్వముఁ జెందును.)

చండా—(ప్రహ్లాదునిఁ బట్టుకొని యాపఁబోవును.)

1వ. బా—ఏమండోయి. బాగా జరుగదు. ప్రహ్లాదుని యుద్యమము మాత్రము మాన్పుటకుఁ బ్రయత్నింపకండి.

చండా—(ప్రహ్లాదుని నిలువం బెట్టి) ప్రహ్లాదా! నీ జనకుని యాజ్ఞ మఱచితివా? హరిభక్తి నీవు మానుట యటుంచుము. వీరి నందఱిని విష్ణు భక్తులగా నొనరించితివే? రమ్ము. నీ తండ్రి యొద్దకు. అక్కడ నీకు బుద్ధి చెప్పించెదను.

ప్ర—గురువరా! చ. తిరమగు నిష్ఠబూని—

(అను పద్యమును జదువుచున్నాఁడు.)

చండా—చాలు. చాలు. నీ యుపదేశంబులు నావద్దఁ బనిసేయవు. రమ్ము. రమ్ము. నిన్ను శిక్షించియైనను త్రివర్గం బుపదేశించెద. పోదము రా!

(నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

స్థలము:—లీలావతీ యంతఃపురము.

[ప్రహ్లాదునితో లీలావతి విచారగ్రస్థయై ప్రవేశించును.]

లీలా—(విచారముతోఁ బ్రహ్లాదునిం బ్రతిమాలుచు)

ఋతువల్లరి వృత్తము.

హా! సుకుమారా! । హా! గుణధీరా! । హా! నయధుర్యా! । హా! వరపుత్రా!
నీ పరివారల్ । నీజనకుండున్ । నీకు గురుండున్ । నెమ్మిని విష్ణున్
బాసి చరింపన్ । భాగ్యమటంచున్ । బల్కినదానిన్ । బాయుట దేలా?
వేసరి చెప్పన్ । వీడ వె కృష్ణున్ । వేసటఁ జెందిన । వేడ వెతండ్రిన్

తనయా! సుగుణవినయా! నా వాక్యంబు లాలించుమా! నన్నుద్ధరింపుమా! నా యీ దరిలేని దుఃఖసాగరమును దాఁటఁ జేయుమా! నీ పితృవాక్యంబు లాలించుమా! విష్ణుభక్తిఁ బరిత్యజింపుమా! గురువాక్యంబుల నాదరింపుమా! నన్నుఁ గరుణింపుమా!

ప్ర—అమ్మా! తల్లిదండ్రులును, పుత్రమిత్రాదులును, ధనకనక వస్తు వాహనంబులును బుద్బుద ప్రాయంబులని యెఱింగియు నీకీ పామరత్వం బేల? కేవల బుద్బుదప్రాయం బగు నీ దేహముం గూర్చి భ్రమ చెంది చెంది దరిలేని మోహంబునఁ దవిలి దవిలి

సీ. సంసారవిపులాగ్ని । శలభ సంగతి గల్గి,
యస్థిర కాయమం । చరయ లేక
కామాంధులై తమ । గతిఁ గానఁగాలేక
మద మోహ మాత్సర్య । మమత పెరుఁగఁ
దారా సుతార్థ సం । తతమోహ శల్యులై
యజ్ఞాన తిమిరంబు । నంటుఁబడుచు

కాలమంతయు వృథా । గడపి యత్యంతంబు
భవరోగ సంబంధ । బాధులగుచు
తే. గీ. యంత్యకాలంబు నందున । యముని చేతఁ
గుటిల బాధలఁ బడుచును । గుంది కుంది
మఱలఁ బుట్టుచుఁ జచ్చుచు । మనుటకంటెఁ
బరునిఁ బ్రార్థించి ముక్తినిఁ । బడయ మేలు ?

జననీ ! అట్టి సంసారకూపంబునందు నన్నేలఁ ద్రోచెదవు నన్నుం గరుణింపుమా ! నా మానసము గలంపకుమా ?

లీలా—నాయనా ! నీ తండ్రి యీ విషయమయి మిక్కిలి పట్టుదల వహించియున్నవాఁడు. నీవు సకల శాస్త్రార్థ పారంగతుఁడవై పరిణమింపుచు బంధు మిత్ర సుత సతీ సంతతులతోడను, ధన కనక వస్తు సమూహంబులతోడను విరాజిల్లుచుండఁగాఁ గాంచి యానందింపఁ దలంచిన నన్నింతగాఁ జిన్నపుచ్చ భావ్యమా ?

ప్ర—అయ్యో ! జననీ ! నీ వెంత వెఱ్ఱిదానవమ్మా ! నీ వుపన్యసించినవన్నియు నిశ్చలదాయకంబులగు సౌఖ్యంబులని యే యెంచితివా ? ఇట్టి తుచ్ఛసౌఖ్యంబులన్నియు మీసాలపైఁ బూసిన తేనెచుక్కలు.

సీ. కాంత గాదది ముక్తి । కాంతను మానవుఁ
జేరకుండఁగఁ జేయు । మారిగాని
బాంధవుల్ గారమ్మ ! । పరమేశు నెడఁ బాపి
నరకంబుఁ జూపు కిం । కరులు గాని
హితులుగా రమ్మ ! శా । శ్వతు నంటఁ జేయని
వికటజ్ఞులైన పా । తకులు గాని
ధనముగా దది మన । మనములు సెడ ముక్తి
దహియించునట్టి యిం । ధనము గాని

తే. గీ. పుత్త్రులంచును మదిలోనఁ । బొంగనేల ?
ధరణి దుఃఖాబ్ధి ముంచు శా । త్రవులు గాని
తుచ్ఛసుఖముల నన్నింటిఁ । దొలఁగఁజేసి
మాయసంసారమును వీడి । మనుటమేలు.

లీలా—నాయనా! మన కులంబునకెల్లఁ బరమశాత్రవుం డగు విష్ణువునిఁ గీర్తించుచుంటి వని నీ తండ్రి యీ వఱకే యాగ్రహాయత్తచిత్తుండై యున్నవాఁడు. తండ్రీ! నా వాక్యంబు లాలించుము.

ద్విపద.

లీలా—మానుర హరిభక్తి । మాను నాతండ్రి!
పూనకు తండ్రితో । పుత్ర! వైరంబు.
ప్ర—మానుట హరిభక్తి । మఱి కల్లసుమ్మి
పూనిన వైరంబు । పోసుమ్మి జననీ.
లీలా—తగునయ్య! వైరంబు । తండ్రితో నీకు
పగవానిపైఁ భక్తిఁ । బాయక నిల్పి.
ప్ర—ఇమ్మైన హరినామ । మెంతటి రుచియొ
యమ్మరో! తెలిసిన । యటు లాడఁగలవె.
లాలీ—బ్రతిమాల నీకింత । పంత మదేల ?
గతి నీవె యను నన్నుఁ । గరుణింపరావె.
ప్ర—పగవాఁడు ననకుండఁ । బ్రార్థించు మమ్మ!
ఖగవాహనుఁడె నిన్నుఁ । గరుణించునమ్మ.
లీలా—జనకుఁడు యిది విన్నఁ । జాల కోపించుఁ
గనఁజాల నే నది । గాన మానుమురా.
ప్ర—పలు పలుకులు నేలఁ । బ్రణుతిఁ గావింతు
జలజాతనేత్రుని । స్మరియింప మాన

లీలా—నా కర్మగతి యిట్లు నన్నలయింప
వాకూన వినుటెట్లు నాదు వాక్యములు.

ప్ర—అమ్మా!

ఉ. కన్నకుమారు విన్నపముఁ గైకొని లాలనఁ జేయుమమ్మ! నీ
చిన్ని నిసుంగుమానసము శ్రీపతినుండియుఁ ద్రిప్పకమ్మ! నేఁ
గ్రన్ననమ్రొక్కువాఁడ నను గాదిలిప్రేమను జూడుమమ్మ! యా
పన్నశరణ్యుఁ గొల్చి భవ బంధములన్నియుఁ ద్రెంపుమమ్మరో!

లీలా—కుమారా! మన కులారణ్యంబున కియ్యెడ దావాగ్ని యుద
యించుచున్నట్లున్నది. లేకున్న నీవింత పట్టుపట్టియుండవు. నీవు
విష్ణుభక్తి మాననని భీష్మించుకొని యున్నాఁడవు. నిన్నేమ
నంగలను?

దుర్మ—(ప్రవేశించి) అమ్మా! మహారాజుగారు నిండుకొల్వున నున్న
వారు. యువరాజుగారినిఁ దోడ్కొని రమ్మనినారు. ఏమిసెలవు?

లీలా—(దిగ్భ్రాంతపడి)

మ. మునుపిందుండటులీనన్నుఁబట్టికొని నాపుత్రుకా వెసఁ దుంపఁగా
జనుచుండన్ గను నారదుండు గని యా జంభారితోఁ జెప్పి మా
న్పెను; మన్నాథునియుద్యమం బకట! మాన్పింపంగ నెవ్వారికిన్
గనశక్యంబగు నేమిదోఁచదయె నా కర్మం బదెట్లున్నదో?

ప్ర—అమ్మా!

మ. భయముం జెందకుమమ్మ! విష్ణు నెపుడున్ భద్రంబుగాఁ బ్రోచు నన్
బ్రియమాతా! జనకుండు బిల్చెనఁట సం ప్రీతిన్ ననున్ గొల్వుకున్
రయమారం జని తండ్రిఫ్రశ్నలకు సారం బెద్దియో తెల్పి నే
నయమారం జనుదెంచువాఁడ జననీ నన్ వేగ దీవింపుమా.

లీలా—నిశ్చలహృదయుండవగు నిన్నేమనంగలను. పోయిరమ్ము.

దుర్మ—యువరాజా! ఇటు ఇటు. (నిష్క్రమింతురు.



## తురీయరంగము.

స్థలకము—హిరణ్యకశిపుని సభ.

[హిరణ్యకశిపుఁడు, చండామార్కుఁడు బ్రవేశింతురు.]

హిర—(క్రోధముతో) గురువరా! తదనంతరం బేమిజరిగెను?

చండా—తరువాత నో దనుజనాయకా! బాలకు లందఱు హరిభజనానందసుందరమనోహరవింసులగుచుఁ బరవశత్వంబున నున్న సమయంబున నేను వారిఁగని వారల పోద్యమంబంతయు మాన్ప నెంచితిని గాని వ్యర్థమైనది. వారలను దండింపఁబోవఁగా వారలు నన్నుంగాంచి "అయ్యా! నేటినుండియు మేము నీ శిష్యులము గాము. మమ్ము దండించకుఁ డనిరి." తరువాత బ్రహ్లాదునిం బిలచి యేల నీ కీవెఱ్ఱి యని యడుగుచుండఁగా నాతఁడు గురువర్యా!

చ. తిరమగు నిమ్మఁబూని—(అను పద్యమును జదివి)

అని నాకు హితబోధ యవలంబించి యున్నాఁడు.

హిర—(క్రోధముతో) అరే! కుఃఘాతకీ! మన వంగడమునకు కపకృతి సల్పిన యానీచుని భజియించుట కంధుండవా? లేక దుర్మదాంధుండవా? నీ పినతండ్రిని మ్రింగిన యా ముక్కిడి తెక్కలిరాయునిం బొగడిన నీ కేమి లాభముగా నాచాటా! బూతుపగిది సంతత మావిష్ణువునే భజించుచుంటివేమిరా!— గురువర్యా!

క. సుతుఁడంచును మది నెంచక
సతతము దండించువాఁడ సత్యంబిది దు
ర్మతియగు హరిఁ గొలువక, స
మ్మతిఁగొని నను వేఁడకున్న మత్ఖడ్గమునన్.

[ప్రవేశము ప్రహ్లాదునితో దుర్ముఖుఁడు.]

దుర్ము—దేవా! మీ యాజ్ఞమెయిఁ బ్రహ్లాదునిం దోడ్కొని వచ్చితిని.

ప్ర—జనకా! నమస్కారము.

హిర—(క్రోధముతో) విష్ణువుని భజియింపవలదని పలుమాఱు నొక్కి చెప్పినను వినక యీ వాసుదేవు నెట్లు భజియింపుచుంటివిరా? మూర్ఖా!

ప్ర—(వినయముతో) జనకా! మనోవాక్కాయకర్మంబుల చేత.

హిర—(అదరిపడి) ఆఁ, ఏమి నీ పొగరు. భగవంతుం డన నెవ్వాఁడు? ఎచ్చటనుం గానరాఁ డేమికతము?

ప్ర—జనకా! మనోనిగ్రహత గలవారికే—అనగా త్వక్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియంబులును వాక్పాణి పాద పాయూపస్థములను కర్మేంద్రియంబులం గెల్చిన వారికే పరాత్పరుండు గాన్పించును గాని పరులకుఁ గాన్పింపఁడు.

హిర—ఎచ్చటను గానరానివాఁ డెట్టి భగవంతుం డెట్లు భక్తులం బ్రోచును?

ప్ర—జనకా! యిటు వినుము.

ఉ. ఉండియు భాస్కరుండు గడు నొప్పుగ నాకసమందు, నెల్లభూ
మండలి కిచ్చురీతి నల మాన్యచరిత్రుఁడు విష్ణుమూర్తి బ్ర
హ్మాండములోన నంతటను నవ్యుతలీలఁ బ్రకాశమానుఁడై
యిందు నెలుంగు నిచ్చుటయె నిర్మలనైజము దాన వేశ్వరా!

హిర—ఔరా! మూర్ఖుఁడా! పెక్కులు పాఠశాలలుంచి పలు తెఱగుల విద్యాభివృద్ధిఁ జేయ నెంచియుండ నా యుద్యమంబునకుం బ్రతికూలంబుగాఁ జేయుచుంటివిగా? ధిక్

ప్ర—తండ్రీ!

సీ. కౌస్తుభాలంకారుఁ / బ్రస్తుతింపుమటంచు
వేడ్కతోఁ జెప్పెడి / విద్య విద్య
పద్మనాభునిభక్తి / భజియింపుమని బోధ
వీనులారఁగఁ జేయు / విద్య విద్య
వాసుదేవునిఁ జాలఁ / వర్ణించి కడుభక్తి
విడువక బోధించు / విద్య విద్య
వైకుంఠు చరితము / వ్రాయించి నిరతంబు
వినిపించు నట్టిదే / విద్య విద్య
తే. గీ. యట్టివిద్యయె విద్య యీ / యవనిలోనఁ
జెలఁగి విద్యాభిమానంబు / గలదటంచు
డంబములు బల్కి తుదకు మా / ధ్యమ్ము గల్గి
శౌరిఁగనలేని బోధనల్ / సలుప నగునె?

హిర—(తనలో) అక్కటా! ఇప్పు డేమిచేయుదును? భగవానిని భజియించుచుండెనను కోపపాశం బొకవైపునకును, పుత్త్రవాత్సల్యపాశం బొకవైపునకును బిగియించి లాగుచున్నయవి. ఏమిచేయుదును? (ఆలోచించి ప్రకాశము) తనయా! చిఱుపాపవగుట నీతప్పు సైరించితి. నావాక్యంబు లించుక వినుము.

ఉ. కూటికి గుడ్డకున్ బరుల / కొంపకుఁ జేరిన బిచ్చగాని నీ
వేటికి దేవదేవుఁ డని / యెంచి భజింపుచునుంటి వోరి! య
మ్మేటిని యుద్ధరంగమున / మించి జయించిన నన్నె నీవు ను
మ్మాటికి దేవదేవుఁ డని / మానసమందునఁ గొల్వ కియ్యెడన్.

పలుమాఱులు నొక్కి నొక్కి చెప్పుచుంటిని. నన్నెదిర్చి చెడకుము.

ప్ర—జనకా! ఎన్ని జయించిననేమి? మనోనిగ్రహత లేని—అనఁగా నింద్రియంబుల జ్జయింపఁజాలని నీవెట్లు భగవంతుండ వయ్యెదవు? ఇంద్రియనిగ్రహంబుఁ గలిగి యాద్యంతంబులు లేక

స్వాయంభువులైన యీ మహాత్రేజంబే భగవంతుండని యెఱుంగుము.

హిర—ఓరోరి వాచాటా! గ్రుడ్డువచ్చి పిల్లను బెదరించినట్లు నన్నే యాక్షేపించుచుంటివిగా? ఔరా! నీ వెంతకైనం దగినవాఁడవురా! మూర్ఖా!

[ప్రవేశము: లీలావతి విచారగ్రస్థయై]

లీలా—ఎంత చెప్పినను వినక పంతగించి నాయందనే విష్ణుభక్తి వీడనని పట్టుఁబట్టియున్న నా కుమారుం డీవిషయంబునఁ దన తండ్రియెడ నెట్లు ప్రవర్తింపుచుండెనో గదా? అయ్యయ్యో! యేమి యుపద్రవంబు సంభవింపనున్నదియో గదా? రాజాజ్ఞ యైనదని దుర్ముఖుండు చెప్పినప్పటినుండియు నామనం బూరక జేయివెట్టి కలఁచుచున్నట్లున్నయది. (కుడికన్నదరుట సూచించి) ఆఁ ఏమిది! నాదక్షిణ నేత్రస్పందము. ఈయనిమిత్తమేదియో యాపద ఘటియిల్లునని ప్రబోధించుచున్నయది. (అని ముందునకుం జూచి భయ మభినయించుచు) మన్నాథుండు ప్రచండకోపోద్దీపితమానసుండై యున్నట్లు గన్పట్టెడి. కారణం బేమైయుండును? (ఆలోచించి) కారణంబునకై వెదుక నక్కఱలేదు. సుతుండు విష్ణుభక్తుండని యెఱింగినవాఁడై వల దని బోధింపఁ బ్రహ్లాదకుమారుండు వినకుండుటచే నాగ్రహాయత్తచిత్తుండై యుండనోపు. ఇప్పుడు నే నీయనకడకుం జని తగిన వాక్యంబులచే శాంతిపరుపఁ బ్రయత్నించెదగాక. (అని నెమ్మదిగా దగ్గఱకుంజని) ప్రాణేశ్వరా! మీ ప్రాణేశ్వరి లీలావతియిదే ప్రణమిల్లుచున్నయది చేకొనుండు.

హిర—(వినిపించుకొనకయె) అరే! మూర్ఖా! దుర్మదచిత్తుండగు నా

హరిందలంచి యాతనిపైఁ బాటలం బాడిన నీ కేమిలాభమురా చెనఁటీ!

ప్ర—తండ్రీ!

సీ. ముక్తికాంతారూఢ ॥ మోహన నృత్యముల్
హరినామ కీర్తన ॥ లవనిమీఁద
సత్యలోకముదాఁక ॥ సరణిఁ గూర్చెడిత్రోవ
హరినామకీర్తన ॥ లవనిమీఁద
దరిలేని దుఃఖాబ్ధిఁ ॥ దాఁటఁజేసెడినావ
హరినామకీర్తన ॥ లవనిమీఁద
ఘనపాపవృక్షముల్ ॥ ఖండించు ఖడ్గంబు
హరినామకీర్తన ॥ లవనిమీఁదఁ

తే. గీ. బుణ్యమార్గంబులకు నెల్లఁ ॥ బుట్టినిల్లు
కామితార్థంబు లిచ్చెడి ॥ కల్పభూజ
మరసిచూడంగ భక్తుల ॥ కురుపిభూతి
హరిని గీర్తించు కీర్తన ॥ లవని తండ్రి!

అట్టి పాటలను విడువ నామనం బొప్పునే? మఱియు,

"సీ. కమలాక్షు నర్చించు ॥ కరములు కరములు
శ్రీనాథు వర్ణించు ॥ జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు ॥ చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ॥ శిరము శిరము
విష్ణు నాకర్ణించు ॥ వీనులు వీనులు
మధువైరి దవిలిన ॥ మనము మనము
భగవంతు వలఁగొను ॥ పదములు పదములు
పురుషోత్తమునిమీఁది ॥ బుద్ధి బుద్ధి

తే. గీ. దేవదేవునిఁ జింతించు । దినము దినము
చక్రిహస్తునిఁ బ్రకటించు । చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి । గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరుమనియెడి । తండ్రి తండ్రి!" (భాగవతము)

కాన నాప్రార్థన మాలించి నన్నుఁ గరుణించి నాయుద్యమంబును మాన్పకుఁడు.

లీలా—(ప్రహ్లాదునిం బ్రతిమాలుచు) ఎన్నివిధంబుల బ్రతిమాలినను వినక నీకింత పంతమేలరా తండ్రీ! తండ్రితో వైరమూనుట న్యాయమా? నీ పితవాక్యంబుల కడ్డువల్కి వాని కాగ్రహంబు దెప్పింపకు.

హిర—(లీలావతిని గెంటి మేఘగర్జనస్వరముతో) ఓరోరి డింభకా! ఏమి నీవాచాలత్వము మేర మీఱుచున్నయదే? బూతుపగిది యూరక భగవంతుండు భగవంతుండని పొగడెదవేలరా దుర్మతీ! వానిపై భక్తిమానెదవా? లేదా? నీమనోనిశ్చయముం దెల్పుము.

ఏకతాళము. పంచచామరవృత్తము. సింధుకమాచి రాగము.

ప్ర-(సౌమనస్యముగా) మనీషివైననీవెయిట్లు । మాటలాడన్యాయమే?
హిర-(పండ్లుకొరుకుచు) చనంగఁగూడదిట్టిత్రోవ । చాలుఁజాలుమానురా
ప్ర-(వినయముతో) మనోజ్ఞమూర్తి చింతనంబు । మాననాతరంబొకో?
లీలా-(బ్రతిమాలుచు) వినంగరాదె తండ్రిమాట । వీనులారఁ బుత్రకా!
హిర-(కోపముతో) గుణంబులేనివాని నీవు । గోరుటేల మూర్ఖుఁడా!
ప్రహ్లా-(వినయముతో) గుణంబులేదుగాన నేనుఁ । గోరియుంటివానినే!
హిర-(గెంటుచు) కనంగరూపహీనునిట్లుఁ । గాంక్షఁ గొల్చెదేలరా?
ప్ర-(వినయముతో) కనంగరూపహీనుఁడౌట । గాంక్షఁగోరితయ్యనే!
లీలా-(దగ్గఱగాఁదీసి) మనంబునందువీడుమయ్య! । మహాసతీసుకీర్తనల్!

ప్ర-(తల్లితో) మనంబునందు వానివీడ ◊ మాత! వందనం బిదే!
హిర-(భార్యతో) మనోహరాంగి! నీవు, పెక్కుమాట లేలఁబల్కఁగా
లీలా (బ్రతిమాలుచు) మనోహరాంగ పుత్రుపైన మానుడయ్య కోపమున్
హిర-(ప్రహ్లాదునితో) మనంగ బుద్ధి లేదె నీకు ◊ మానసంబునందునన్
ప్ర-(తండ్రితో) గనంగ నిష్టమున్నయట్లు ◊ గాలమెల్లఁ బోవునే?
హిర-(గెంటుచు) క్షణంబు తాళు మింకనిన్ను ◊ శైవఁజాలమూర్ఖుఁడా!
లీలా-(విచారముతో) గనంగ జాలఁబుట్టి బాధ ◊ గన్నులార దైవమా!

హిర—(లీలావతిని దూరముగా గెంటగా తూలిక్రిందపడకుండ నాపుకొని పైఁటచెరఁగుచేఁగన్నీరుఁ దుడుచుకొనుచు హిరణ్యకశిపుని కాళ్ళవద్దఁ గూరుచుండి బ్రతిమాలుచు.)

ఉత్సాహ.

విమలమతిని సుతునిఁ బ్రోవ వేఁడుచుంటి మిమ్ములన్
హిర—భ్రమరవేణి! నీదుకోర్కెఁ ◊ బాటిసేయ నియ్యెడన్
లీలా—రమణ! రమణ!! నీదురమణి ◊ ప్రార్థనంబువినవుగా
హిర—కుమతి యిట్టులేల నాదు ◊ కోపమిూవు పెంచెదే?

ఓదుష్ట పిశాచమా! లీలావతీ! నీకారణంబుననే యీ ప్రహ్లాదుండు చెడిపోవుచుండెనని తలంచెదను. కాఁబట్టి నీ వీ విషయంబున మఱుమాటఁ బల్కకుము. అట్లు పల్కితి వేని నిన్ను తుండె తుండెంబులక్రింద నఱికి తీరెదను. జాగ్రత్త. (సేవకునితో) ఓరీ! నీవతి రయంబునం జని యెట్లున్నట్లు రమ్మని నా యాజ్ఞగాఁ దెల్పి మంత్రియగు విప్రజిత్తి నిటకుం దోడ్కొని రమ్ము

దుష్మ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

హిర—ఓరీ! ఇంకొక్కపరి నిన్నడిగిచూచెదను. అందులకును వ్యతి

రేకంబుగాఁ బ్రవర్తించెదవేని నీమానప్రాణంబులు నీకుం దక్కవు. ఏమనియెదవు ? విష్ణుభక్తి మానెదవా లేదా ?

ప్ర—నా నిశ్చితాభిప్రాయం బీవటకే మీ కెఱింగింపఁబడియె. వేతే నన్నడుగనేల ?

హిర—గత్తు. తగదు తగదు మూర్ఖుఁడా !

ప్ర— తగదు తగదు కోపమున్

హిర— పగతు నిటుల గొల్చెదే

ప్ర— పగతుఁ డెవఁడు నెంచఁగన్.

హిర—(కోపముతో కత్తియెత్తి) ఆ దుష్టపుత్రకా ! ఇదే చచ్చితి విరా ! (అని మీఁద కుఱుకును.)

లీలా—(అడ్డుగాఁజనియేడ్చుచు) నాథా! శాంతింపుఁడు. శాంతింపుఁడు

హిర—(లీలావతిని దూరముగా నెంటి) ఛీ ! ఛీ ! దుర్మార్గురాలా ! దూరంబుగా నుండుము. అడ్డంబుగా వచ్చిన నిన్నుం గూడ ఖండించెదం.

దుర్మ—(ప్రవేశించి) దేవా ! తమ యాజ్ఞమెయి మంత్రియగు విప్రజిత్తిం దోడ్కొని వచ్చితిని.

హిర—(పండ్లు పటపటం గొఱుకుచు) మంత్రీ ! విప్రజిత్తీ ! వంగడమున కపకీర్తిందెచ్చెడి దుష్టబుద్ధియగు నీప్ర్హాదుండు—ఛీ ! ఛీ ! వీని నామ ముచ్చరించిన మహాపాతకము. మనవైరియగు విష్ణువునిఁ బొగడుచు నాప్రాణవాయువుల నొప్పించుచున్నవాఁడు

లయగ్రాహి.

వీఁడుఁ గడు దుర్జనుఁడు ౯ చూడు మలశ్రీధరుని
వేఁడుచును బాటలను ౯ బాడుచును నుండెౘ

వీడుమని చెప్పినను ౹ వీడడయె విష్ణువుని
వేడఁ డాగి నన్గరుణఁ ౹ జూడుమను పల్కున్
గూడుకొనుపేర్మి దిగ ౹ నాడితిని గాన గడు
వాఁడిగల ఖడ్గముల ౹ తోడఁ గడు వేగన్
పోడిమిని సంశయము ౹ వీడుచు మదర్భకుని
తాడనము సేయుఁ డిఁకఁ ౹ బీడఁగొని చావన్.

ప్ర—తండ్రీ! కం శిక్షింపఁగ, రక్షింపఁగ
దక్షుం డల హరియె గాని ౹ దలపోయంగా
నీక్షోణీ తలమందున
రక్షోనాయక! యొరులకు ౹ రయ సాధ్యంబే?

హిర—నామాట యెంతమాత్రము విశ్వసింపక హరీ! హరీ! యని పరి పరివిధంబులఁ బ్రేలుచుంటివిగా? కానిమ్ము. నిన్నా హరియే రక్షించుఁగాక. విప్రజిత్తీ! రాజపుత్రుండని శంకింపక, కోపావేశంబున నాజ్ఞాపించితినేమోయని సంశయింపక, రాక్షస కులంబునకుఁ గళంకముఁదెచ్చిన, యీకులద్రోహి, నీపితృఘాతకుం డేయేమార్గంబులఁ జచ్చునో యాయామార్గంబులన్నియు అనఁగా వేయేల తుద కగ్నిం బడవైచి యైనను సరియే వీనినిమ్రందించి సత్వరంబుగ రమ్మని దండనాథుండగు విరూపాక్షునకు నా యాజ్ఞగాఁ జెప్పి దదనుచరుండవై నీవుఁగూడఁ బొమ్ము. సంశయింపకుము.

లీలా—(మహాదుఃఖముతో) నాథా! నాథా!! ఈచిఱుతపైఁ గరుణవహింపుమా! నాముద్దుచెల్లింపుమా! రక్షింపుమా! రక్షింపుమా!

హిర—ఛీ! ఛీ! నీవు నాయెడ నిట్టిప్రశంసం జేకుము. (అని లీలావతిని గెంటి) మంత్రీ! సంశయింపక కడు వేగంబునఁ బొమ్ము

(నిష్క్రమించుచున్నాఁడు.)

విప్ర—ప్రహ్లాదా! నడువుము. (ప్రహ్లాదుని తోడ్కొని నిష్క్రమించుచున్నాఁడు.)

లీలా—(ప్రహ్లాదుఁడు పోవుచుండఁగాఁజూచి గద్గదస్వరముతో) హా! కు-మా-రా! పోవుచుంటివా? హా! హా! హా! హా! (మూర్ఛిల్లును.)

ఇది తురీయాంకము.

తే. గీ. ధరణి పుసులూరివంశాబ్ధి శీతకరుఁడయి
వరలు సూర్యప్రకాశ నామ శాస్త్రి మనుమఁ
డైన యలఘుసుకవి సోమేశ్వర శాస్త్రిచేత
వ్రాయఁబడె నిది భూమిపై వరలుగాత.





శ్రీ

# ప్రహ్లాద

పంచమాంకము—ప్రథమరంగము.

స్థలకము—పర్వతముల గుంపు

[ప్రహ్లాదునితో విరూపాక్షుఁడును, విప్రజిత్తియుఁ
బ్రవేశించుచున్నారు.]

విప్ర—(అపవారించివిరూపాక్షునితో) విరూపాక్షా! ఏమియాశ్చర్యము!

సీ. స్రుక్కఁడయ్యెను గదా? ✽ దిక్కుంభియూథముల్
పాదంబులం ద్రొక్క ✽ బాలకుండు
మడియఁడయ్యెను గదా? ✽ వడిఖడ్గములఁద్రోడ
నలయించి బొడిపింప ✽ నర్భకుండు
క్రుందఁడయ్యెను గదా? రంధ్రముల్ బిగియించి
దయలేక బాధింప ✽ దారకుండు
పోవఁడయ్యెను గదా? ✽ భూమిలోఁ బాతించి
చంపఁగాఁ జూచిన ✽ శాబకుండు

తే. గీ. జేయ, నభిచారహోమంబు ✽ శీఘ్రగతిని
ప్రాణము ల్వీడఁగాలేదె ✽ బాలకుండు
యెఱుఁగఁజే? జీవనౌషధ ✽ మింతయైన
యెటులఁ బ్రతుకుచునుండెనో ✽ యెఱుఁగరాదు.

కానిమ్ము. ఇప్పు డీ శైలాగ్రంబునకుం దోడ్కొనివచ్చితిని గదా? ఇచ్చ టినుండి బాలుని క్రిందకుం బడ ద్రోసితిమేని యెప్పుడైన నీతం డనుగ్రహముం బాయకుండు నేమో జూతము. (అని ప్రహ్లాదునితోఁ బ్రకాశముగా) ప్రహ్లాదా! లోకులకు మిక్కుటంబగు బాధ లెన్నియో బెట్టితిమే? వానినన్నింటిని నెట్లు సైచుచుంటివో కొంచెమైనం గానరాకున్నయది. నిన్ను బాధించుటకు మాకుఁ జేతు లాడకున్నయవి. నీవు విష్ణుభక్తిఁ బరిత్యజించుమా?

ప్ర—అయ్యలారా! మీ కిష్టంబగు నన్నివిధంబుల బాధింపుడు. నేనో ర్చెద. కాని విష్ణుభక్తి వీడుమనిమాత్రము మీరు నాకు బోధిం పకుఁడు. మఱియు బాధ లెట్లు సైచుచుంటివని యడిగితిరి గాని యందు నా ప్రజ్ఞావిశేషం బేమియు లేదు. ఇటువినుండు

తే. గీ. అవ్యయానందు, గోవిందు, హరి, ముకుందుఁ
బ్రవిమలాకారుఁ, బంకజపత్త్రనేత్రు
భవ్యచారిత్రు, సంసారభయవిదూరు
స్థిరమతినిఁ గొల్వ బాధలు దరికి రావు.

కావున నే,

మ. స్థిరభావంబునఁ గొల్చుచుంటి మదిలో శ్రీనాథుఁడై, యీశుఁడై,
హరియై, కేశవుఁడై, పరాత్పరుఁడునై, యంతర్గతజ్యోతియై,
వరుఁడై, పాపవిమోచనుండయి, కృపావారాశియై, శౌరియై
సురముఖ్యప్రణుతైకుఁడైన సుజనస్తోమాఘచింతామణిన్.

విప్ర—అటులైన మా ప్రయత్నం బేమియు లేదు. విరూపాక్షా! ఈ శైలా గ్రంబుననుండి వీనినిఁ గ్రిందఁబడఁద్రోయుము. సంశయింపకుము.

విరూ—చిత్తము. (అని ప్రహ్లాదుని శైలాగ్రంబునఁ బరుండఁబెట్టు చున్నాఁడు.)

ప్ర—(పరుండియే ముకుళితహస్తుఁడై) ఓ! దేవాదిదేవా! యజ్ఞా

ధీమ్తవు, సత్యానన్తుండవు, పరిశుద్ధుండవు పరంధాముఁడవు, పరంజ్యోతివగు నీదివ్యపాదారవిందధ్యానైకచిత్తుండనై యుంటి నని నాపై నీర్ష్యవహించి నన్ను మడియింప నీశైలతటంబునుండి క్రిందకుం బడఁద్రోసిరఁట ఓ! కరుణామయా! చరాచర సమస్తభూతసకలప్రదేశంబుల నంతర్బాహ్యంబులయందును నివ్వారి ముల్లుచందంబునం బ్రకాశించుచున్నట్టి నీ వీ శైలంబునందుండు వని వీరెఱుంగరైరి. మహానుభావా! నన్నుద్ధరింపుము.

తే. గీ. విషయసంబంధజన్యమై వెలయునట్టి
యలఘు సంసారసౌఖ్యముల్ దొలఁగఁజేసి
నిర్మలంబైన నీభక్తి నీయఁగదవె
చిరశుభాకార! మోక్షుల క్ష్మీ విహార!

విరూ—(శైలాగ్రముననుండి ప్రహ్లాదునిం బడఁద్రోయును.)

ప్ర—(క్రిందికిదొర్లి వచ్చి లేచి చేతులుమోడ్చి) హే! మహానుభావా! పాపరహితా! ఒకపరి జగముల వెలుపలను, మఱియొకపరి లోపలను నిడుకొని యుభయంబు నొక్కదృష్టి వీక్షించు సకలార్థసాక్షివగు నీఘనలీలామహిమార్ణవం బెఱుంగ నెవ్వరికి శక్యంబగు. హేతండ్రీ! భక్తజనమందారమా! భక్తజనానురక్త్యాసక్తవిశోకనుండవగు నో పురాణపూరుషా! మాం పాహి. మాంపాహి.

విరూ—దేవా! ఈ సమయమున వృథుం బీపర్యాయమునఁగూడ వెనుకటి ఫలంబే యొసంగినది.

విప్ర—కానిమ్ము. వీనింగొనిపోయి కూలంకషాల్లోలజలనిధిలోఁ బారవైతమురమ్ము. (అని ప్రహ్లాదునితో నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయరంగము.

స్థలకము—సముద్రము.

[ప్రహ్లాద, విరూపాక్ష, విప్రజిత్తులు ప్రవేశించుచున్నారు.]

ప్ర—హే! విశ్వాత్మక! పృథివ్యాప స్తేజోవాయు రాకాశములను పంచభూతములును, శబ్దస్పర్శరూప రసగంధమును, పంచవిషయములును, త్వక్ చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబు లను పంచేంద్రియములును, వాక్ పాణిపాదపాయూపస్థము లను పంచకర్మేంద్రియములును, మనోబుద్ధి చిత్తహంకారము లను, నంతఃకరణ చతుష్టయములును ననునీప్రకృతిస్వభావంబులన్నియు, నీయందే మందీభూతమగుచున్నవి గదా?

శా. నిత్యానిత్య వివేక వేదులు మహా విస్తాత్మ లేరూపమున్
మత్యంతంబులఁ గాంచి నిశ్చలతరా నందాంబుధిన్దేలి రా
గత్యాగంబున రశ్మిసంకలిత వి జ్ఞానంబు గైకొందు రా
సత్యంబైన స్వరూప మీ వెకద భా స్వద్దీనచింతామణీ!

విప్ర—విరూపాక్షా! ఇదేమియో మహాద్భుతంబుగానున్నదే? ఏమి యీయాశ్చర్యము! మహోన్నతమైన పర్వతరాజంబు పైనుండి క్రిందంబడవైచినను, బాలుం డిసుమంతయుఁగందఁడయ్యెనే? వీని వద్ద నేదియో మంత్రాకర్షిణి యున్నయట్లున్నది. కానిమ్ము. చూతము. వీని నిప్పుడీ మహాభీలజలార్ణవంబునఁ బడవేయుము.

విరూ—చిత్తము. (అని యెత్తి సముద్రములోఁ బడవేయుచున్నాఁడు.)

ప్ర—(ఒకటి రెండు నిమేషంబులాఁగి లేచినిలచుండి ముకుళితహస్తుఁడై) ఓ కరుణాకరా! భవరోగభిషగ్వరా! దామోదరా! జననాశాకారక ర్మాహ్వాయచేతనాదివిశేషంబులయందును, సత్వాత్మికాదిభౌతికసంచిక క్రియావిజృంభణంబులయందును, విరహి

రహితుండవై తామరాకునందలి జలంబుచందంబున విలోలుం డవుగాక సృష్టిస్థితిలయావ్యాపారత్వంబున ప్రకాశించెడి యో పరబ్రహ్మస్వరూపమా! మాంపాహి—మాంపాహి.

విప్ర—(ఆశ్చర్యముతో) విరూపాక్షా! నాప్రాణములువిసిగిపోవుచున్న యవి. వీని నెన్ని విధంబుల నిమ్మడియింపజూచినను జచ్చుటలేదే ఎంతకాలమువీనితోఁగూడ మనము బాధలుపడుట. అబ్బబ్బా! వీనినింబెట్టుబాధలఁ జూడలేక నాకండ్లు మూతలుపడుచున్న యవి. (తలపంకించుచు) కానిమ్ము. రాజాజ్ఞచొప్పున కడసారి వీనిని గణగణమండుచున్న మహానలంబునంబడ వేయుదమురమ్ము అప్పటికిని జావకున్న వీనినిజంపుట మాతరమయినదిగాదని రాజునకొప్పగింతము.

విరూ—అగునగు నెంతకాలము మనకీయుద్యోగము. పోవుదమురండు.

(అని ప్రహ్లాదునితో నిష్క్రమించుచున్నారు.)



## తృతీయరంగము.



స్థలకము—అగ్ని.

[ప్రహ్లాదునితో విరూపాక్ష, విప్రజిత్తులు ప్రవేశించుచున్నారు.]

ప్రహ్లా—ఆర్తరక్షణపరాయణా! నారాయణా! ఆపద్బాంధవా!

శా. నీకారుణ్యముఁ గల్గఁబట్టిగద యో నీరేజపత్రేక్షణా!
వీరల్ బోవకనిల్చె ప్రాణములు బృహద్ధ్వక్షార్థిలోఁ ద్రోయఁగా
నాకర్ణింపవె, మన్మహార్తినిఁక వీరగ్నిన్బడన్వైచ నన్
స్తోకత్వంబున బ్రోవరావె సుజనస్తోమాఘచింతామణీ!

విప్ర—ప్రహ్లాదా! కడసారి నా వాక్యంబు లాకర్ణింపుము. చెడకుము.

హావ్యవాహనుం డల్లదే కదుంగడు బ్రజ్వరిల్లుచున్నవాఁడు. ఏమ నియెదవు? తరువాత మా యత్నం బేమియు లేదు. మా మాట వినుము.

విరూ—నాయనా! ఈ మంత్రిశేఖరుని వాక్యంబు లాకర్ణింపుము.

ప్రహ్లా—అయ్యలారా!

తే. గీ. పంచభూతాత్మకం బౌచుఁ బరిణమించు
నట్టి దేహంబు శాశ్వతం బగున జగతి?
నెమ్మి 'జాతస్యమరణం ధ్రువ' మ్మనంగ
వినియు, నే నెట్లు హరిభక్తి విడువఁగలను.

కాఁబట్టి మీరు మీమీయుద్యోగంబుల నెఱవేర్పుఁడు. సంశయింప కుఁడు. తల్లి సంతసించుననియు, జనకుండాగ్రహంబువీడుననియు, మీరు బాధలం బెట్టరనియు, మనంబునం దలంచి విష్ణుభక్తి మా నెదననుకొనుచున్నారా? అట్లెన్నటికినిం దలంపకుఁడు.

విప్ర—సరే. మా వాక్యంబుల వింటివేని బాగుపడియెద వనుకొంటిమి. అట్లుగాక నిర్భాగ్యత నిన్ను నెత్తిపైఁ దన్నుచుండ మే మేమి చేయఁగలము.

విరూ—(ప్రహ్లాదుని బట్టుకొనుచున్నాఁడు.)

ప్రహ్లా—(కరములు మోడ్చి నిమీలితలోచనుండయి)

మ. వరవైకుంఠపురంబునందుఁ గడు దివ్యస్వర్ణశాలాంకగో
పురహేలాన్విత మైన మేడపయినన్ బొల్పారుశ్రీదేవితోఁ
గర ముప్పారెడు నీదునామము జగత్కల్యాణ నేఁ గొల్తు భా
సురలీలన్ నను బ్రోవుమయ్య! సుజనస్తోమత్రాణచింతామణీ!

శా. నిత్యంబై, నిఖిలార్థదం బగుచు వర్ణింపఁగా నున్నదై,
సత్యంబై, సదసద్వివేక గుణసంస్కారప్రమోదాత్మనా

సత్యంబై, శుచియై, మహామహిమమై, శ్రీ భాసిల్లు నీరూప మే
నత్యంతంబు భజింతుఁ బ్రోవఁగదవే? శ్రీ జ్యాయఃకళాపూర్ణిమా!

విరూ—(ప్రహ్లాదుని యగ్నిలోఁ బడవేయుచున్నాఁడు. అగ్ని చల్లారును.)

విప్ర—(తనలో) ఔరా! ఈతఁడు త్రైలోక్యసమ్మోహనేంద్రజాలకుఁడు గాని బాలకుండుఁ గాఁడు. ధైర్యమన్న నీతనిదే ధైర్యము. మనోనిగ్రహత్వంబును, ధైర్యస్థైర్య ధుర్యగాంభీర్యంబులును, భగవద్భక్తియు, నీతని కలంకారములు గదా? (ప్రకాశముగా) విరూపాక్షా! వీనిని మడియించుట మనకుశక్యముగాదు. కావున మన మొనరించిన మారణోపాయంబులును, దానికింగలిగిన ప్రతిఫలంబును, సానుపూర్వకముగా మన యేలికకు నివేదించిన మన కీతని బాధించెడిబాధ తొలంగును. రమ్ము పోదము.

విరూ—చిత్తము. (అని అందఱు నిష్క్రమింతురు.)



## తురీయరంగము.



స్థలకము:—సభాభవనము.

[హిరణ్యకశిపుఁ డుచితాసనముపైఁ బ్రవేశించుచున్నాఁడు]

హిర—(విచారముతోఁ దనలో) నే నెంతమందభాగ్యుండను. కన్న కుమారుని - నావంశాంకూరమును - నాముద్దుల పుత్రకుని - ప్రమాదించుమని యాజ్ఞనిచ్చితినే? నావంటి నిర్భాగ్యుం డెందైనం గలఁడా? పసికూనయగుటచే నాకుఁ బ్రబలవిరోధియైన విష్ణువునందలి భక్తి నిలిపి మిక్కిలి భజియించుచుండె. కొంచెము జ్ఞానమువచ్చినతరువాతనైన విష్ణుభక్తిఁ బరిత్యజించునేమోయని యైన యోజించనైతి. (ఆలోచించి) పసికూనయైనను నా వాక్యంబులయందించుకేనియు నాదరము జూపఁడయ్యెనే? వీని

కీవిష్ణుభక్తి యెట్లులవడినది ? (నిదానించిచూచి) వీనికి జనియిం చినపరమమూర్ఖతవలన—వీనికాయుఃపరిమాణవిహీనత్వంబువ లన—నా కానందపదభ్రష్టుత్వంబువలన—లీలావతీపూర్వకర్మ పరిపాకంబువలన— (పండ్లు పటపటంగొఱుకుచు) మాయావి యగు నావిష్ణువంతర్జ్యోతియై వెలుంగుటవలన—(క్రోధముతో) ఓరోరి! దుర్మతీ! కులగోత్రరూపవిహీనా! నిన్నిక్షణంబులోపల మర్దించి, నాతమ్ముం జంపి, యీపసిబాలున కింతటి దుర్బోధ యొనర్చిన నీకండకావరంబణంగించెద. తొందరపడకుము. నిన్నే సంహారింపలేనియెడ నా యీమహోత్కృష్టంబగు వరప్రభావం బెందులకురా! జడమతీ!—హా! కుమారా! మద్భాగ్య రాశీ! ముద్దులకుట్టా! నీ కింతలోననే నూఱేండ్లునిండెనా ? నీ పాలిటికి నేనే మృత్యుస్వరూపము నైతినా? అయ్యయ్యో! భరింపరాని పుత్రమరణంబువిని లీలావతికూడ ప్రాణములువిడు చునేమో ? (అదరిపడి) అట్లయిన నే నీ జీవములను భరియించి పుడమిపై మనియుండఁగలనా ? (ఆలోచించి) ఓ విధాతా! సృష్టికర్తా! సత్యలోకాధీశా! వాణీమనోహరా! హంసవా హనా! నీవిచ్చినవరంబువలన నాప్రాణంబులఁ బాయుటకైనను వలనుగాకుండవచ్చెనే ? ఏమిచేయుదును ? అయ్యయ్యో! పు త్రిశోకంబుతోఁలుతను, తనుపరి భార్యావియోగంబునుఁ గల్గుట నిశ్చయము. ముమ్మాటికిని నిశ్చయము. వీరల నిరువురందలంచి, వీరివర్తనం బాలించి, చింతించి, కృశించి, వగచి, యెందులకుం గొఱగానిజీవములతో నిండిన మొండికట్టెయను, నిల్పిననేమి ? నిల్పకున్న నేమి? అట్లని చావంగలనా? విధాత ప్రసాదించిన వర ప్రభావంబుచే నాకుఁ జావుకలుఁగదుగదా ? హా ! ముమ్మా టికినిగలుగదు. (అని తెరవైపుఁజూడఁగా విరూపాక్షు, విప్ర

జిత్తు లిరువురే కనఁబడినట్లభినయించి వడఁకుచు) ఆ-అ-అల్ల-దే విరూ-పాక్ష-వి-ప్ర-జి-త్తు-ల-ఎ-రు-దెంచుచున్నారు-కుమారుం డు-స్వర్గ-లో-క-ప్ర-యా-ణ-మై-పోయి-నట్లుఁ-గాన్పిం-చె-డి- అక్కటా! నాయవస్థ యెంతవఱకు వచ్చినది. వీని విష్ణుభక్తి యెంతవఱకుఁ బరిణమించినది. (గుండెలు బాదుకొని) నా-కఠినమైన-మీఱరుటకువీలు లేనికర్కశంబులగు నాయాజ్ఞలను వీరు నెఱవేర్పకుందురా? ఆబాధలం బడఁజాలక-నా-పసికూన-లోకజ్ఞానమిసుమంతయు లేని బాలకుఁడు-ముక్కుపచ్చలారని చిన్నినసుఁగు-క్రమగ్గకుందునా? అయ్యయ్యో! నా వంశము నేఁటితో భస్మీభూతమగుచున్నది. (క్రోధముతో) ఓరోరి రాక్షసకులవిద్వేషీ! వైకుంఠవాసా! నీకారణంబున మద్వంశార్ణవం బింకిపోయినది. కావున నీప్రాణాపహరణంబు గావింపకుండ నిన్ను హిరణ్యకశిపుండు విడువఁడు. ఇంకెందుఁబోయెదవురా! దుర్మదచిత్తా! (అని తొందరగా రెండడుగులు ముందునకు వైచి చూచి నిర్ఘాంతపడి) ఆఁ, ఏమిది! నాకన్నులను నేను నమ్మవచ్చునా? ఆ వచ్చువాఁడు నాభాగ్యరాశి యగు ప్రహ్లాదుఁడు గాఁడా? నిస్సందేహముగా నాభాగ్యరాశి యగు ప్రహ్లాదుఁడే! (వినుటనభినయించి) ఏమిది? "చక్రిదాస్యమునెడి చక్రింబుచేఁగాక" అనియా పాడుచుండెను? వీనికీపాడు బుద్ధి వదలినది కాదుగదా? (విప్రజిత్తి, ప్రహ్లాద, విరూపాక్షులు ప్రవేశించిన వెంటనేఁ బ్రహ్లాదునిహస్తములఁ బట్టుకొని యదలించుచుఁ బట్టఁజాలనికోపముతో) ఓరోరి డింభకా! ఏమంటివిరా,

ప్ర—తండ్రీ! ఏమున్నయది.

సీ. నారాయణుని దివ్య । నామాస్త్రమునఁ గాక
సంసారబంధముల్ । సడలు నెట్లు?

విష్ణుదేవుని కృపా ౹ వృష్టిచేత నేఁగాక
కూరపాపాగ్ని చల్లారు నొక్కొ?
శ్రీమనోహరు భక్తి ౹ సింగంబుచేఁ గాక
సంతాపగజములు ౹ చచ్చునొక్కొ?
కమలనాభుని దృష్టి ౹ ఘనవాయువునఁ గాక
దుఃఖమేఘంబులు ౹ దొలఁగునొక్కొ?

ఆ. వె. చక్రిదాస్యమనెడి ౹ చక్రంబుచేఁ గాక
మత్సర మద మోహ ౹ మమత లనెడి
క్రూరశత్రుకోటిఁ ౹ గూల్పఁగాఁ బన్నునొక్కొ?
ధాత కైనఁ గాని ౹ దానవేంద్ర!

హిర—(తలపంకించుచు) పెద్దా! నా నియోగము నెఱవేర్ప లేదా?

విప్ర—స్వామియాజ్ఞ కన్యథా చరింతుమా?

హిర—అటులయిన వీఁడేల మడియలేదు?

విప్ర—ఈ బాలకుని యం దేదియో మాహాత్మ్యమున్నట్లున్నయది.

హిర—ఏయే బాధలం బెట్టించితిరి? అందుఁ గాన్పించిన మాహాత్మ్యం బేమి?

విప్ర—ఒకటియా! రెండా! చెప్పనలవి గానన్ని బాధలం బెట్టించితి. అందుఁ గొన్ని సంగ్రహముగా విన్నవించెద వినుండు: పుడమిలోఁ బాతించితి. శూలంబులచేఁ బొడిపించితి. గజములచేఁ ద్రొక్కించితి. రంధ్రంబులన్నియు బిగియించితి. మహోన్నతంబులైన పర్వతరాజంబులనుండి క్రిందఁబడఁ ద్రోయించితి. మహోదధిలో ముంపించితి. తుదకు మీయాజ్ఞచొప్పునఁ గణకణఁబ్రజ్వరిల్లు యగ్నింబడవైచితి. అగ్ని చల్లారె నేగాని బాలుం డిసుమంతయును లొంగలేదు. దేవా! ఇంతయేల? మే మెన్ని బాధలం బెట్టినను—

ఉ. కందఁడు, తత్తరింపఁడు, బ్రి ౹ కంపము నొందఁడు, భీతితోడఁ దా
గుందఁడు, పెట్టు బాధలకు ౹ కోపముఁ జెందఁడు, పెద్దనిద్దుర

న్జెందకు, మమ్ముదూరకు విశేషముగాఁ బరమేశుఁగొల్చు నా
నందమెగాని, యోయసురనాథ! తలంపకుఁ దల్లిదండ్రులన్.

హిర—ఏమీ! నీవేదియో గొప్పగాఁ జెప్పుచుంటివే?

విప్ర—దేవా! ఇందతిశయోక్తి యేమియును లేదు.

హిర—(ఆలోచించి) పాములవాని నొకనిని శీఘ్రగతిం బిలిపింపుము.

విప్ర—విరూపాక్షా! రాజాజ్ఞ నెఱవేర్పుము.

విరూ—చిత్తము. (అని నిష్క్రమించి పాములవానితోఁ బ్రవేశించి)
ప్రభూ! తమయాజ్ఞనెయి నీపాములవానిం దోడితెచ్చితి.

పాము—పభోఁకిదండాలు, పభోఁకిదండాలు, ఏలినోరుగీపి సూడాలంటే
మూసెడ్డపాములుండా యిగాసామి, సిత్తగింసండిబాబో సిత్తగిం
సండి. (అని కూర్చుని నాగస్వరము బట్టుచున్నాఁడు.)

హిర—ఓరీ! నీవద్ద నేయేరకముపాము లున్నవిరా?

పాము—ఏరకముపాము లేంటిబాభో! నేను యినికినేనుబాభో! దాన్నె
ప్పుడు నేసూఫ్నేగు సామి

హిర—నీవద్దనున్న పాములపేరు లెవ్వియో చెప్పఁగలవురా?

పాము—సిత్తముబాభో. (ఒక్కొక్కటేతీయుచు) ఇదిగో యిది మల్లె
తాసు. ఇది ముగలితాసు. ఇదికిట్టచప్పం. ఇది లేడిముక్కలతాసు.
ఫభోరుదీన్నిసూడాల. దీన్నిగంటే రసూలుకొండ తూర్పుదిబ్బల
మీద తల్చిగ్గోచింది రెణ్నెల్లుకాది యెరమింగినదాన్ని పదిమం
దిమిపోగడి వొడేసిపట్టినాము సామి. అప్పుడుగంటేనీ మావో
ళ్ళిద్దరిని యేసిందికాటు. సచ్చిపోనారు సామి. మావొల్లమూలిన
పామండి.

హిర—సరియే. ఈ లేడిముక్కలనాగు చేతను. మల్లెత్రాచుచేతను యీ
బాలకుని యిరువైపుల నొక్కమాఱుక ఱపింపుము. (అనిమాత్రి

ఓో) మంత్రీ! నీవిచ్చటనుండి విరూపాక్ష దుర్ముఖులచే బాలకు నిబట్టుకొనఁ జేసి యీపాములచే ప్రహ్లాదుని గఱపించుమనుము.

పాము—బాభోయి. బాభోయి. మారజ్జా! మీకు దండాలు. నే నీయువరాజుగారిని కరపింపలేను బాభో. రచ్చించండి. పెభులు.

హిర—(కత్తి యెత్తి జళిపించుచు) కఱపించెదవా? లేదా?

పాము—(వడంకుచు) సిత్తము. బాభో. రచ్చించండి మారజ్జా! కఱి పిత్తానండి. కఱిపిత్తానండి.

హిర—ఆఁ అట్లు బుద్ధికలిగి మసలుకొమ్ము. మంత్రీ! ఈకార్యమునం దప్రమత్తుండవై మెలంగవలయు. (నిష్క్రమించుచున్నాఁడు)

(దుర్ముఖుఁడు విరూపాక్షుఁడు ప్రహ్లాదునిబట్టుకొని సరిగా నిలబెట్టుదురు)

పాము—(నాట్యముఁ జేయుచు)—పాట.

లే, లే, నాగన్న ౹ లేడీచుక్కలనాగ
బాలుని, భక్తుని ౹ ప్రహ్లాదు గరువంగ॥ లేలే॥

కరసినావంటేని ౹ కర వెల్ల తీరు నాకు
తిరుగక యొడియేసి ౹ కరవంగ యేగమె॥ లేలే॥

మల్లెతాసుతోడ ౹ సల్లంగ నీవుకూడ
వొల్లెల్ల తెగమొడిసి ౹ సల్లంగ సంపెయవె॥ లేలే॥

దుర్ము—ప్రహ్లాదుని కఱపింపఁబోయి నన్ను కఱపించేవుసుమ్మా! కొంప తీసి. ఆనక చిక్కుపడలేను. నేను చచ్చినా యిబ్బంది లేదుకాని నాకోసము చాలామంది పూర్వాసువాసినీలు మళ్ళీ విచారించడము వస్తుంది జాగ్రత్త. బాబు! బాగాచూచి మఱీకఱపించు.

పాము—(నెమ్మదిగా సమీపించుచున్నాఁడు).

ప్ర—(కరములుమోడ్చి వినమ్రుఁడై) ఓ భక్తవత్సలా! ఓ పరమ

కృపాళూ ! ఓ జగదీశ్వరా! ఓ భక్తభయనివారకా ! ఓ భక్త జనానంద సంధాయకా !

శా. కార్పణ్యంబు వహించి నా జనకుఁ డు గ్రజ్వాలసంఖేలనో
ద్దర్పప్రాభవ మైన కృత్యముల వి స్తారంబు బాధించి; దా
మార్పన్ జేయుటకై హరిస్మరణముం గన్పింపఁగాలేక; యీ
సర్పశ్రేణులఁ దెచ్చెఁ బ్రోవఁగదవే సర్వాత్మకా ! శ్రీహరీ !

పాము—(పాములను విడుచుచున్నాఁడు)

[ఆకస్మికముగా గరుత్మంతుండు ప్రవేశించి రెండుకాళ్ళతో
రెండుపాములను తన్నుకొని పోవుచున్నాఁడు.
అందఱును నిశ్చేష్టులై చూచుచుందురు.]

ప్ర—(చలించక మానసికపూజ యభినయించును.)

పాము—(విచారముతో) ఏంటిబాభో ! యీ సిత్తరం. నాగతేంటి బాభు ! అయ్యో నాకమ్మమా ! దీన్నిసూసినోళ్ళల్లా రెండేసి డబ్బులిచ్చేవోరు బాభూ! అయ్యో నా కెల్లాగొత్తయ్యింక బాభూ. (రోదనము చేయును).

[ప్రవేశము: హిరణ్యకశిపుఁడు]

హిర—(క్రోధముతో) మంత్రీ ! ఏల నాయాన నిరాకరించితివి?

పాము—(ఏడ్చుచు) బాబయ్యా ! నాకొంపతీశారుగాదుండీ. పాడు ముండాగద్దొచ్చి నాపాముల నెత్తుకెల్లిపోయింది బాబయ్యా? నా బతుకెల్లా బాభూ ! నా పెళ్ళాంబిడ్డ లుసూరుమంటారు బాభూ !

విప్ర—దేవా ! వీనిని పాములచే కరిపింప నుద్యుక్తులమైయుండఁగా నక్కడి నుండియో మెఱుపువలె గరుడుం డరుదెంచి యావిషోరగంబులం గబళించుకొనిపోయె. మే మేమిచేయంగలము.

హిర—(క్రోధముతో) అటులయినచో నే నిద్యోడనేయుండి వీఁ డెట్లు

మడియుఁడో చూచెదను. నీ విప్పుడ లోనికరిగి విషపూరితంబై యున్న భృంగారకం బొకదానిని దీసికొనిరమ్ము.

విప్ర—(సందేహించును.)

హిర—సందేహించెదవేల?

విప్ర—దేవా! మఱేమియు లేదు గాని నీ—

హిర—(క్రోధముతో) కానీ యని నుడువక సత్వరంబ జనుము.

విప్ర—(లోనికింజని విషపూరితంబైన భృంగారంబుతో వచ్చి హిరణ్యకశిపున కిచ్చుచుండఁగా లీలావతి ప్రవేశించి యిరువురకు మధ్యగాఁజని)

లీలా—(ఆతురతతో) నాథా! నాథా! కరుణవహింపవా? నా మనవి యాలింపవా? గర్భవాసమే? పుత్రమరణమే? భరియింపరానిదే? అందున బలవంతముగ చేఁ జేతనే చంపుకువే? అయ్యయ్యో! నాకడుపు చుమ్ములుచుట్టుకొనిపోవుచున్న యదే? నీ పదరాజీవంబు లంటి వేఁడెద. ప్రార్థించెద. కొంచెము నిదానించుము. బాలకునిఁ గ్రుందించుట మాని బంధించుము. నేనోర్చెదనంతియేగాని గర్భశోకం బనుభవింపఁజాల. అనుభవింపఁజాల నాథా! ముమ్మాటికి ననుభవింపఁజాల. నాపైనున్న ప్రేమ యెటుపోయె? ఎట్టి కార్యమునందైనను నాయానగా నాకోర్కె జెల్లించెదనని బాసచేసితివే? మాటయిచ్చి తిరుగుట మాననీయులకుచితమా? (పట్టరానిదుఃఖముతో పదములపై వ్రాలియేడ్చుచు) అబ్బబ్బా! ఈవిచారంబు భరియింపఁజాల. ఈచిన్నారి కన్న సుకుమారుని జంపించెదవేల? పగవానిమైఁబడి పగదీర్చుకొనుటయుత్తమముగాని- కన్నకుమారునిపై- వంశాంకూరముపై- పున్నామనరకంబు పోగొట్టువానిపై-యువరాజుపై- నీప్రియపుత్రునిపైననా పగ సాధింపఁ జూచుట. ఒరులు విన్న నవ్వరా? పుత్రఘాతకుఁడవని

నిందింపరా? ఎంతకష్ట మెంతకష్టము. పగివానిం గొల్చుచుండె ననునేర మొక్కటియే గదా వానియందుంట. పసికూనయే-అది యునుంగాక యజ్ఞానంబువలనం గొల్చెడి యర్థంబులేని భక్తివలన మన కేమినష్టము. నీవేల కరుణవహింపవు? నాథా! అనుగ్రహింపుము. పుత్రభిక్షమిమ్ము. (విషపాత్రందీసికొనుచు) దయయుంపుము, రక్షింపుము.

హిర——(మేఘగర్జనస్వరముతో) నీప్రార్థనలఁ జాలించి యీవిషంబు వానిచేఁ ద్రావింపుము. సంశయింపకుము.

లీలా——(విచారముతో) ఇదేటి న్యాయము. ఇంకెట్లు నాప్రాణంబులు భరియింతును. నవమాసంబులు మోసి-కని-పెంచి- చేఁజేతనే విషమిచ్చి చంపెడితల్లు లెందైనం గలరా? హా! హా! హా!

హిర——ఓసీ! నీచదువులు మాని నాయాజ్ఞ నిర్వర్తించుము. (త్రోసివేయును.)

ప్రహ్లా——అమ్మా! సతులకు పతియాజ్ఞమీఱుట ధర్మముకాదు. కావున నీవిట్లు జాలివై జాలిందూలక విష్ణుసేవామృతంబును నాకిమ్ము. (విషమునుదీసికొనును.)

లీలా——హా! తనయా! తనయా! హా! హా! హా! (మూర్ఛిల్లును.)

ప్రహ్లా——(విషపాత్రను చేతంబట్టుకొని కొంచెముసేపు ధ్యానముజేసి.)

ఉ. గాదిలి కన్నబిడ్డఁడని ♦ గారవ మించుకయైన లేక, నన్
బాదుగ సంహరించుటకు ♦ బాధ లనేకము గల్గఁజేసి, వి
చ్ఛేదము సేయలేక, మదిఁ ♦ జింతిలి ఘోరవిషానలంబు, సం
ఖాదముగాఁగఁ జేసె నిఁకఁ ♦ గావఁగదే కరుణాపయోనిధీ!

ఆహాహా! నేఁటికి మద్భాగ్యవశంబున విష్ణుసేవామృతమును సేవింపం గల భాగ్యము కలిగినది. (అని త్రావుచున్నాఁడు.)

లీలా——(మేల్కాంచి చూచి) తనయా! తనయా! నన్ను విడనాడి

పోయెదవా ! (అని మరల మూర్ఛిల్లుచున్నది.)

హిర—(నిట్టూర్పువిడచి తనలో) ఏమిది విషపానంబువలనను డింభకుం డసువులం బాయకుండెనే ? ఏమైయుండును ? (ఆలోచించి) దీనింబట్టి యాలోచించిచూచినచో వీనివలన నాకే యాపదఘటి యించునని తోంచుచున్నయది. (ఆశ్చర్యముతో) తోంచుటయే నా? నాకు మృత్యువు తప్పదా? (ఆలోచించి) అట్లయిన విధాత యొసంగిన వరంబులు రిత్తబోవునా? కల్ల. అట్లెన్నటికిని బోవు. (ప్రకాశముగా) ఓరోరి రాక్షసకులార్ణవబడబానలా ! ని న్నిప్పుడీ ఖడ్గంబునకెర చేయుందలంచితి. ఏమనియెదవు? హరిభక్తి మానెదవా? నీశిరము మొండెమునుండి వేఱుచేయమనెదవా? నేనే చంపందలంచుకొన్న నీకు దిక్కెవ్వరురా మూర్ఖా ?

ప్రహ్లా—జనకా ! సత్వరజస్తమోగుణప్రధానుండై లీలావినోదంబున సకలప్రపంచంబులం గల్పించి, రక్షించి, ఖండించునట్టి కర్తయై భర్తయై, హర్తయై యన్నిరూపంబులయందునను ప్రకాశించు నట్టివాండై, యెవ్వండు తనభక్తులం గాపాడుచుండెనో యట్టి మహానుభావుండే నాకు దిక్కు.

హిర—ఏమీ నీవాచాలత్వము? నీసందర్భ మంతకంతకు మర్యాదనతిక్రమించి ప్రవర్తించుచున్నయదే? ఓ కాహరియేదిక్కుగా? హరి యన్నిరూపంబులందును బ్రకాశించువాండుగా? అట్లయిన వాం డిప్పుడిక్కడ, యేరూపంబునం బ్రకాశించుచుండెనో యెఱుంగం జేయుము? నిన్నును వానినింగూడ ఖండించి లోకము నిష్కంటకము గావించెదను. సందేహించెదవేలరా ! దుర్మతీ !

ప్రహ్లా—నాయనా ! నానాజంగమస్థావరవర్గంబులయందును, నీయందును, నాయందును, సకలప్రదేశంబులయందును, నంతర్జ్యోతియై ప్రకాశించుచుండును. వెండియు యీయారూపంబు లననేల ?

సకలరూపంబు లాతనివే!

"కం. ఇందు గలఁ డందు లేడను
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే" (భాగవతము.)

హిర—(కోపముతో) ఏమంటివి? (వికటముగా)

"కం. ఇందుగలఁ డందు లేడను
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే?"

అనియా! నేనిచ్చటఁ జూపుమనిన నచ్చటూహరిం జూపఁగలవా?

ప—జనకా! మీ యాజ్ఞ యైనచో-

లీలా—(మూర్ఛఁదేరి వెఱ్ఱిదానివలెఁ జూచుచు నిలువంబడును)

హిర—అట్లయిన నేఁడీ చూత మీ సభాస్తంభంబున నాహరిం జూపుము.

ప్ర—(స్తంభంబుచుట్టుఁ బ్రదక్షిణముఁ జేయుచు) త్రైలోక్యపాలకా! పురాణపూరుషా!! జాతుర్హోత్రరూపా!!!

తే. గీ. సర్వమేధాయ కర్మణి స్తారణాయ
స్నిగ్ధనానార్థభూషాయ చిన్మయాయ
నిఖలనాథాయ శాన్తాయ నిర్గుణాయ
విశ్వరూపాయ రోచిష్ణవే నమోస్తు.

ఓదేవా! నినుఁజూడ నాతండ్రి మిక్కిలి యాస వహించియున్నాఁడు. నేను నీభక్తుండనేని నాతండ్రికోర్కె నెఱవేర్పుము.

హిర—ఓరీ! నేను కాలహరణంబున కోర్వను, వేగఁ జూపుము.

ప్ర—తండ్రీ! స్తంభంబునందున్న నాహరిని జూడ నంధుల వైతివేని నీవే పిల్వుము. మఱియు, నీకీసందేహమేల?

" శా. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబుననుండు ప్రౌఢవిపుల స్తంభంబునందుండఁడే?
స్తంభాతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహము న్లేను, ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్."

కాఁబట్టి నీ వాసంశయము వీడి పిల్వుము. (భాగవతము.)

హిర—(క్రోధముతో స్తంభంబుదరిం జని బిగ్గరగా) ఓరోరి మాధవా! హిరణ్యాక్షుని పందివై చంపిన పిఱికిపందా! నీచమగు చేప రూపమున సోమకాసురునిఁ జంపిన పోటుమానిసీ! కపట మార్గానువర్తీ!

శా. క్రోధోద్రేకముతోడ నీ నక మూర్తిక్రోడాకృతుల్ దాల్చి మా
యాధిక్యంబున నన్నుఁ జంపుటకునై యత్నించి, యత్యంతమున్
మేధాస్నిగ్ధభుజాబలంబునకు దా ర్ల్మిఁ జెందఁగా లేక, బ్రి
ధ్వాధైర్యంబుననున్న చో పిఱికి పందా! రమ్ము ఖండించెదన్.

నీకు నిక్కువమైన పౌరుషమే గలదేని పురుషసింహుండవై వచ్చి నా యెదుట నిల్వుమురా! (అని స్తంభంబును గ్రుద్దుచున్నాఁడు.)

[స్తంభము బ్రద్దలగును]

[శ్రీనారసింహావతారము గాన్పించును]

శ్రీనార—(హుంకారధ్వని చేసి హిరణ్యకశిపుని బట్టుకొనఁబోవుచుండును) (తెర వ్రాలును.)

పంచమరంగము.

[శ్రీనారసింహుని యూరువులపై హిరణ్యకశిపుఁడు బడియుండఁగా లీలావతి యొకప్రక్కను, ప్రహ్లాదుఁ డొక్కప్రక్కను నిలుచుందురు. బ్రహ్మాదు లొకదెస నిలుతురు.
తెర లేచును]

బ్రహ్మాదులు—(స్తుతింతురు)

ప్ర—(కరములుమోడ్చి)

మ. ఫలముల్ పూవులు పల్లవంబులును శో । భంజెందు భూమీజమ
ట్టుల నీభావము పక్వగౌరవ్యకులా । టోపంబులన్ జెంది; ని
శ్చలకారుణ్యముతోడ భక్తులను స్వే । చ్ఛావృత్తి సంరంభతన్
వెలయన్జేసిన నీమహామహిమకున్ । వేజొద్ది సర్వేశ్వరా!

శ్రీనార—(శాంతి వహించును.) (తెర వ్రాలును.)

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఇది శ్రీసత్యవతీ కృపాపాత్ర భారద్వాజసగోత్ర పవిత్రాయినాపురపు వంశలతాంకూర సత్యమాంబా బాపనామాత్య మిథునగర్భ శుక్తిముక్తాఫల మృదుమధుర కవితాపిశేష్యైశ్వర సుబ్రహ్మణ్యశాస్త్రి, మలకపల్లి చిన శేషగిరిరాయ కవిద్వయ ప్రియశిష్య విబుధ సజ్జన విధేయ సోమేశ్వరాహ్వాయ కవి ప్రణీతంబైన ప్రహ్లాదనాటకమునందు సర్వమ్మును పంచమాంకము సమాప్తము.



# అనుబంధములు

## 1వ అనుబంధము.

[తెర యెత్తగానే జయవిజయులు పాడెడు పాట]

మోహనరాగము—ఆదితాళము.

ప॥ మనదే భాగ్యము - మనదే పుణ్యము

1. ఎల్లకాల మిటు - చల్లని తండ్రిని - చల్లగ గొలుచుచు
ద్వారపాలకులమయి - దనరుచు నుండెడి॥ మన॥

2. ఎట్టిపుణ్యము మన - మెన్నడు జేసితిమో
యిట్టివైభవము మన - కిప్పుడు గల్గుట కరయగ॥ మన॥

3. రాజీవ నేత్రుని పద - రాజీవములను సతతము
భక్తిని గొల్చుచు భజి - యించెడి ప్రాప్తి లభించిన॥ మన॥

4. శ్రీరమామనోహరుని - చిత్తమునందున నిల్పి
పాదసన్నిధినె - నెప్పుడు - బడియుండెడి॥ మన॥

## 2వ అనుబాధము.

[శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయినప్పుడు జయవిజయులు పాడెడిపాట]

కళ్యాణిరాగము—ఏకతాళము.

ప॥ మము - రక్షించుము దేవా!

1. శ్రీకర గిరివర - కరుణాకర - శుభకర
యోగీంద్ర హృద్విహారా! దయఁజూచుచు॥ మము॥

2. ప్రకటితమగు నీ మహా - మహిమ తెలియగనో
యకలంకా - యెవరితరము - మా తరమా॥ మము॥

3. మునులు శపించిరి - ఘన రాక్షసులు గంపని
మనజాలము నిను వీడి - దయతోడుత॥ మము॥

4. పాహి, పాహి, యని - పాదములంటితిమయ్యా!
దా సోహమన్నవారి బ్రోవ - ధర్మము గదటయ్యా॥ మము॥

## 3వ అనుబంధము.

[హిరణ్యాక్షుఁడు చనిపోయెనని విని హిరణ్యకశ్యపుడు
సందర్భానుసారముగా బాడెడు పాట]

ముఖారిరాగము—ఏకతాళము.

ప॥ హా, హా, హా, హా, సో - ద - రా!
పోయితివా దివికి - ననువీడి॥ హా॥

1. కిటి యేమి? నీ ప్రాణము దీయుట యేమి? న
మ్మట కర్హముగాదుర - ఆ - సోదరా - ఆహా॥ హా॥

2. ముల్లోకంబులు గడ - గడ లాడఁజేసిన
నీ నామము నెల్లు మరతురా సోదరా!॥ హా॥

3. తల్లికేమని నే - ధైర్యము జెప్పూరా!
తల్లి కొక్క-సిఁజేసి - తరలిపోతివా సోదరా॥ హా॥

## 4వ అనుబంధము.

[మహేంద్రుఁడు తీసికొనిపోవుచుండెనని లీలావతి
సందర్భానుసారముగా బాడెడు పాట]

హిందూస్థానీ తోడిరాగము—త్రిశ్రగతి.

1. నాపతి తపంబు చేయఁ - బోయినపుడె
నా కీ - దుర్గతి గూర్చితే - దైవమా?॥ నా॥

2. ఓహో! నాథా! - నాథా! - యెందుంటివో
నీవు గృహమున లేని తరి - యింద్రుండు - నా
కీ - పాటు గూర్చెనుగంటే॥ ఓహో॥

3. నీ సతి - మానము గాచెడి - దిక్కు-లేదు - లవమైన
కాపాడరావె - నాపయి దయరాదే
నా మొఱ వినఁబడదే॥ ఓహో॥

4. వినఁడాయె నా మాట - కనఁడాయె ధర్మము
మనుటింక నెట్లు - ఓ - మానవాధీశ్వరా! ఈశ్వరా॥ నాథ॥

5వ అనుబంధము.

[సందర్భానుసారముగా లీలావతి యుంద్రిని బ్రతిమాలెడి పాట]

పున్నాగరాగము—అటతాళము.

1. వదిన యనఁగ - తల్లి యగును - వావిదైనఁ
జూడవా వాసవా॥ వది॥
2. పరకాంతనైన - కామలు పెట్టుట - భావ్యముగాదందురే
మహేంద్రా॥ వది॥
3. బ్రతిమాలుకొందు - బాధింపకు మిఁక - ననువీడుమన్నా
బలసూదనా॥ వది॥
4. పుట్టఁబోవుబిడ్డ - నిన్నేమి చేయఁగలఁడు
పాపము వలదు మరదీ॥ వది॥

6వ అనుబంధము.

[శంబరుఁడు యింద్రుని దురాచార మెఱింగించినపిమ్మట
హిరణ్యకశ్యపుఁడు పాడెడు పాట]

వసంతరాగము—జంపెతాళము.

ఎందుఁబోయెదవు - ఎందునక్కెదవు - ఏమిచేయుదువు
దుర్మతీ! ఖలా నీ॥ ఎందు॥
వధిన యనెడి - వావిదైన - మనమునందు దలపకే
పట్టినట్టి - నిన్నుఁబట్టి - మట్టుబెట్టనే - వచ్చినప్పు॥ ఎందు॥

## 7వ అనుబంధము.

[పాఠశాలలో పంతులు వెడలినపిమ్మట ప్రహ్లాదుఁడు గాక తక్కినవారు పాడెడి పాట.]

బేహాగ్ రాగము—రూపకతాళము.

ప॥ చదువెందుకో - అన్నలారా - మనకు॥ చదు॥

అ॥ ప॥ పంతులు పోయాడు - గంతులు వేద్దాము॥ చదు॥

1. ఆటలనాడుచు - పాటలఁబాడుచు
తోటల హాయిగా .. నాటకు బోకింక॥ చదు॥

2. పాఠాలు రాకుంటె - పంతులు కొడతాడు
దెబ్బలు కొడతాడు - అబ్బబ్బ! మన కొద్దు చదువు॥ చదు॥

3. ఆటవిడుపుడబ్బు - లడుగకుండ మనము
ముడుపుఁ జెల్లించి - గడుసుపంతులు మాటాడడు॥ చదు॥

4. పంతులు చెప్పక - పాఠాలు మా కెట్లు
వచ్చుననుచు నింట - నచ్చజెప్పవచ్చు॥ చదు॥

## 8వ అనుబంధము.

[ప్రహ్లాదుఁడు బాలురతోఁ జెప్పుటకై సందర్భానుసారముగాఁ బాడెడు పాట.]

హిందూస్థానీ బేహాగ్ రాగము—జంపెతాళము.

ప॥ ఆహా - సతతంబు - దేవదేవు ధ్యానమువలన

అ॥ ప॥ కల్గు నానందంబు - తరమే వర్ణింప॥ ఆహా॥

1. అండపిండ బ్రహ్మాండమెల్ల
నిండియున్న శ్రీహరి - పదరాజీవములను గొలువఁగ॥ ఆహా॥

2. హృదయాంతరవాసుఁ - హితభక్తులదాసున్
చిదచిద్విలాసుఁ - చిత్తవికాసున్॥ ఆహా॥

9వ అనుబంధము.

[ప్రహ్లాదుఁడు తల్లి యగు లీలావతికి ధైర్యము జెప్పుట.]

జంఝూటి రాగము—త్రిపుటతాళము.

ప॥ పరమేశ్వరుఁడుండ - భయమేల నమ్మా!॥ పర॥

1. మనసారగ నా - మహామహుని
గొలువు మమ్మ - ఫలము గల్గు॥ పర॥

2. భవబంధమోక్షుఁడే - పావనచరితుండే
భక్తులఁ బ్రోచెడివాఁడే - పాపవిమోచనుఁడే॥ పర॥

3. దుష్టజన శిక్షకుఁడే - శిష్టజన రక్షకుఁడే
నిర్వికార నిరంజనుఁడే - నిర్గుణరూపుఁడే॥ పర॥

---

10వ అనుబంధము.

[తురీయాంకములో తురీయరంగములో హిరణ్యకశ్యపుఁడు, లీలావతి, ప్రహ్లాదుఁడు కలిసి పాడెడు డైలాగ్.]

కాంభోజి రాగము—రూపకము.

హిర—మానవేర! నీ య - మానుష చరితుని గొలువ
కూడదురా - మన - కులమునకు
తీరని దుఃఖము గూర్చిన - తుఁబువని - గొలువ॥ మాన॥

ప్రహ్లా—నీ - యనుమానమె గానీ
భూ - నాయకుఁడగు నా హరికి
హితులు - విరోధులు - లేరయ్యా॥ నీయను॥

తోడి రాగము.

హిర—తోడి రాక్షసుల గనుము
బుద్ధి దెచ్చుకొని మనుము

పాపుఁడు కూ్రరుఁడు - పరమాత్ముం డతఁడు గాఁడు
నమ్మించిన వాఁడీ లేఁడు లోకముల లేఁడు॥ మాన॥

నిత్యకల్యాణి.

ప్రహ్లా—నిత్యకల్యాణమూర్తియైన - యా
నిర్గుణ పరబ్రహ్మమూర్తి యేడ
అహంభావత్వమున నున్న నీ వేడ
కూడను - కూడను - అటులాడకుము పాడవకుము॥ నీయ॥

మోహనరాగము.

లీలా—మోహనాకారా - ముద్దుకుమారా!
తండ్రిత్రోడ వైరమునకు - తలపడకుమురా
నామాట వినుమురా
నా ముద్దు తీర్పరా॥ మోహ॥

ఆనందభైరవి

ప్రహ్లా—పతి మాటలె సత్యమటమ్మా
తప్పు తప్పు అటు లనకమ్మా!
ఆనందభైరవు డతఁడమ్మా
ఆర్తత్రాణపరాయణుఁ డమ్మా!॥ నీయ॥

## 11వ అనుబంధము.

[ప్రహ్లాదుఁడు సందర్భానుసారముగా తండ్రిచెంత పాడెను పాట]

మధ్యమావతిరాగము—ఏకతాళము.

శిక్షించుట నీ తరమా!
శ్రీహరిభక్తుని - చిదానందరూపుని॥ శిక్షిం॥

అహంకారము నిన్నడచును సుమిన్నా!
వలదుకోపము - గొలువుము దేవుని
బడయుము ముక్తి - నా మనవి విను మనుర క్తి॥ శిష్యం॥

12వ అనుబంధము.

[పంచమాంకములో ప్రధమరంగమున ప్రహ్లాదునిపాట.]

కల్యాణిరాగము—రూపకము.

1. దేవాదిదేవా! నీ - దివ్యపదములె గొలుతున్
బ్రివిమలాకారా నీ - భక్తుని గావరావె॥ దేవా॥
2. జగము వెలుప లోకపరి - జగములోప లోకపరి యుండ
సకలార్థ సాక్షివగు - నీ సామర్థ్య మెఱుఁగవశమె॥ దేవా॥
3. కొండపైనుండి ద్రోసి నను - చంపెదరట నాయండ నిలిచి
కల్యాణమూర్తి కాపాడరావె॥ దేవా॥

బారువా.

1. మనోబుద్ధి చిత్తాహంకారము నీ
ప్రకృతి స్వభావములే గావా॥ దేవా॥
2. నిను దెలియ నాదు వశమా
నిర్మ లానందరూపా॥ దేవా॥
3. సంద్రములో ద్రోతురట
భక్తుని సాకగ బరువా॥ దేవా॥

కన్నడ.

1. నిత్యుఁడవే - నిర్గుణరూపుఁడవే
సత్యంబైన - స్వరూపుడవే॥ దేవా॥
2. అగ్నిద్రోసి నను జంపెదరట
ఆహా - కన్నడసేయఁగ తగవే॥ దేవా॥

## 13వ అనుబంధము.

[ప్రహ్లాదుఁడు సందర్భానుసారముగా 5వ అంకములో పాడెడుపాట.]

మలయమారుతము—త్రిపుట.

1. పతితపావన - భక్తపోషణ
పాహి పాహి యని నీ - పదములఁ బడితి॥ పతి॥

2. నీ దాస్యమొకటి మత్సర, మద, మోహా
మమత లనెడి శత్రులఁ బరిమార్చు దేవ॥ పతి॥

3. నీదివ్య నామమహిమ - నెవరి తరముపొగడ
కలదె ముక్తి నీ నామము - దలపకున్న॥ పతి॥

4. కమలనాథ! నీ - కారుణ్యము నాపై రాదే
శ్రీమనోహరా - చిన్మయరూపా!
ప్రేపుఁ జేర్చుకొని - భక్తుల బ్రోవఁగ రావా!॥ పతి॥

---

## 14వ అనుబంధము.

[ప్రహ్లాదుఁడు పాములచే కరువఁబడునప్పుడు పాడెడుపాట.]

సింహేంద్రమధ్యరాగము—త్రిపుటతాళము.

ప. ఖగవాహనా! కాపాడరావా!

1. శేషశాయి వగు నీ - చిన్మయరూపము
గొల్చెడి నన్నిట - గీటడగింపఁగ
పన్నగముల దెచ్చి - రావన్నరతు॥ ఖగ॥

2. నీ పేరుఁ దలఁచిన - మనసార గొలిచిన
పన్నగములే గాదు
మృత్యుదేవియే రాలేదు దరికి॥ ఖగ

## 15వ అనుబంధము.

[విషపానసమయమున ప్రహ్లాదుఁడు పాడినపాట.]

దేవగాంధారిరాగము—అటతాళము.

1. విషధర విషధర - విషధర వేగమె రారా!
భక్తుని బ్రోవర - పరమపావన చరితా!॥ విష॥

2. నీధ్యాన మెపుడున్ - నెమ్మది నిల్పిన నన్నున్
విషమునఁ జంపఁగనుండిరి గావఁగ రావా!॥ విష॥

3. నీ భక్తుని విషమా - జాపును
దానికి గలదా శక్తి
సర్వశక్తిమంతుఁడ వగు
శ్రీహరివగు నీకరుణ గలుగ॥ విష॥

సమాప్తము.



# శ్రీకృష్ణరాయబారము

"శ్రీకృష్ణరాయభార" మనుటతోడనే ప్రతియాంధ్రునకును ఇందలికథ జ్ఞప్తికి వచ్చితీరును. ఈరాయభారము బ్రహ్మశ్రీ చక్రధానల మాణిక్యశర్మగారిచే నూతనముగా వ్రాయబడినది. పాత్ర పోషణమున నేమి, పాత్రౌచిత్యమున నేమి ? దీని కిదియే సాటి. ధర్మజుని ఔదార్యము, భీముని రౌద్రము, శ్రీకృష్ణుని యుక్తి ప్రయుక్తులు, కర్ణాశ్వత్థామల తగవులాట, ధృతరాష్ట్రుని కృత్రిమాలోచన చదివి విని యానందింపగలయునే కాని యూరక వర్ణించుటవలన లాభముగానరాదు. ఒక్కసారి చదివి చూడుడు. కర్ణుని జన్మరహస్యమును శ్రీకృష్ణుడు, కుంతియు గూడ వాని కెఱింగించి పాండవులలోనికి రమ్మనమని బోధింప కర్ణుడు తెల్పిన ధర్మములు విని తీరవలయును.

చక్కని పార్శి కర్ణాటక మట్లుతో సహా — వెల రు 0—12—0

# పరలోకయాత్ర

ఈగ్రంథము శ్రీ కోటమర్తి చినరఘుపతిరావుగారిచే రచియింపఁబడెను. ఇందలి కష్టములతో గతించిన యొక జీవియొక్క పరచరిత్రమంతయు నతిజ్ఞానదాయకములగు ప్రమాణ గ్రంథవిషయములతో వ్రాయఁబడెను. ఆజీవికొనర్చిన ఘోరపాపకార్యములనుబట్టి యనుభవింపదగిన నరకబాధలు నుత్తరజన్మములు నుత్తరజన్మానుభవభోగ్యభోగములును విపులముగాఁ దెలుపబడియున్నందున నందఱు చదివితీరఁదగిన గ్రంథము. — వెల 0—8—0

వలయువారీ దిగువ విలాసమునకు వ్రాయుఁడు.

కసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు,
ఇన్నీసుపేట, రాజమండ్రి.

# అనసూయ

ఇది శ్రీయుత అయినాపురపు సోమేశ్వరరావుగారిచే రచియింపబడి యిప్పుడే ముద్రిణమై వెలకు సిద్ధముగానున్నది. అనసూయ సుమతుల పాతివ్రత్య మహాత్మ్యము. అనసూయ బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బాలురగా జేయుట మాండవ్యుని శాపము సుమతి సూర్యోదయముగాకుండ శపించుట. సుమతి పాతివ్రత్యమహిమవల్ల సుమతి భర్త మరల జీవించుట మొదలగు సంగతులు నిపుణముగా వ్రాయడమయినది. ఒక సారి చదివి చూడుడు.

వెల రు 1—0—

# విచిత్రచిత్రమాల

నవరసభరితమైన రైమెదంకముల నూతన నాటకము.

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వరరావుగారిచే" రచియింపఁబడి యిప్పుడే ముద్రిణమై వెలకు సిద్ధముగానున్నది. అత్యద్భుతంబగు కథ. చదివినకొలఁదియుఁ జవులూరుచుండును. చిత్రమాలా, రాజసింహులకు బరస్పర వైమనస్యము గలుగవలెనని తలంచి చిత్రమాల తండ్రియగు ప్రభాకరుఁ డొనరించిన దురాగతము జదివిన గర్భ నిర్భేదమగును. స్త్రీవిద్యనుగూర్చియు, కన్యా వివాహమును గూర్చియు ప్రభాకరునకును, వాని మంత్రులకు నడచిన వాదన, ప్రతివాదములు శాస్త్రసమ్మతములై, హృదయంగములై యుండును. ఇట్టి పుస్తక మిదివఱకు వెలువడి యుండలేదు. త్వరపడకున్న ద్వితీయ ముద్రణమువఱకు నిరీక్షింప వలసివచ్చును.

వెల రు 0—12—0

వలయువారు:— వసుపులేటి వెంకట్రామయ్య,
అండు బ్రదర్సు,
రాజమండ్రి, ఇన్నీసుపేట.